# కమ్యూనిస్టు మానిఫెస్టో


## కార్ల్ మార్క్స్

## ఫ్రెడరిక్ ఎంగెల్స్


రవి కుమార్.


ప్రచురణ :

కామ్రేడ్ కొల్లా వెంకయ్య మెమోరియల్ లైబ్రరి

పెదనందిపాడు - 522 235

గుంటూరు జిల్లా

**కమ్యూనిస్టు మానిఫెస్టో**
**తెలుగు అనువాదం : రాచమల్లు రామచంద్రారెడ్డి**

**ప్రచురణ నెం. 2**
కామ్రేడ్ కొల్లా వెంకయ్య మెమోరియల్ లైబ్రరీ
పెదనందిపాడు - 522 235
గుంటూరు జిల్లా.

**ప్రతులకు :**
అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో

కామ్రేడ్ కొల్లా వెంకయ్య మెమోరియల్ లైబ్రరి
పెదనందిపాడు - 522 235
గుంటూరు జిల్లా

డా. కొల్లా రాజమోహన్
చిలకలూరిపేట - 522 616
గుంటూరు జిల్లా
ఫోన్ : 9000657799

**వెల :** 10 రూ/-

కమ్యూనిస్టు మానిఫెస్టో

---

**ముద్రణ :** డాన్‌బోస్కో టెక్నికల్ స్కూల్ ప్రెస్
రింగ్‌రోడ్డు, గుంటూరు. ఫోన్ :2350832


Manifest

der

Kommunistischen Partei.

Veröffentlicht im Februar 1848.

Proletarier aller Länder vereinigt Euch!

London.
Gedruckt in der Office der „Bildungs-Gesellschaft für Arbeiter"
von J. E. Burghard.
46, Liverpool Street, Bishopsgate.

కమ్యూనిస్టు మానిఫెస్టో
తొలి ముద్రణ ముఖచిత్రం
1848, ఫిబ్రవరి, లండన్.



# ప్రపంచ
# కార్మికులారా
# ఏకంకండి.

# ముందు మాట

మార్క్స్ - ఏంగెల్స్‌లు కమ్యూనిస్టు మానిఫెస్టోని ప్రపంచ మానవాళికి అందించి ఇప్పటికి 167 సంవత్సరాలైంది (1848 ఫిబ్రవరి) ప్రపంచంలోని దాదాపు అన్ని భాషల్లోకీ ఇది తర్జుమా చేయబడింది. తెలుగులో కూడా 4 అనువాదాలు (కంభంపాటి సత్యనారాయణ, మహీధర రామమోహనరావు, రాచమల్లు రామచంద్రా రెడ్డి, గిడుతూరి సూర్యం) వచ్చాయి. ఇందులో కొన్ని ఇప్పుడు కూడా అందుబాటులో ఉన్నాయి. ఇప్పుడు మరో ప్రచురణ అవసరం ఏమిటి? అనే సందేహం చాలామందిలో కలుగుతుంది.

గత అనువాదాలు కొంచెం సంక్లిష్టంగా ఉన్నాయనిపించింది. అనువాదం కొంచెం సరళీకరిస్తే బాగుంటుందనిపించింది. వ్యవహారిక భాష అప్పుడప్పుడే నిలదొక్కుకుంటున్న రోజుల్లో ఆ క్లిష్టత అనివార్యమైన ఈ రచనను సరళీకరించటం అనుకున్నంత సులభం కాదని పనిలో దిగినాక అర్థమైంది. ఇంగ్లీషు ప్రతితో వివిధ తెలుగు అనువాదాల్ని పోల్చి చూసుకుంటూ ఒక అవగాహనకు రావటానికి చాలా సమయం పట్టింది. మూలంలోని బిగి సడలకుండా, గత అనువాదాల్లోని క్లిష్టతను సరళీకరించటం ఇంతకంటే సాధ్యం కాలేదు.

ప్రపంచాన్ని గురించి ఎంతమంది తత్వవేత్తలు ఎన్ని భాష్యాలు చెప్పినా, దాన్ని సమూలంగా మార్చాలని చెప్పినవారు మార్క్స్ - ఏంగెల్స్‌లు. ఆనాటి కమ్యూనిస్టు లీగ్ ఆదేశాలతో వారు సమర్పించిన ఈ పత్రం వెలుగులోనే 1871లో పారిస్ కమ్యూన్, 1917లో అక్టోబర్ విప్లవం విజయవంతమయ్యాయి, ఆ తర్వాత తూర్పు యూరప్ దేశాల్లో, చైనాలో, వియత్నాం, లావోస్, కాంబోడియా, క్యూబాలలో కూడా విప్లవాలు విజయవంతమయ్యాయి.

అయితే ఈ మహా విజయాలతోపాటు సోషలిజం కొన్ని అపజయాల్ని కూడా చవిచూసింది. 1990 ప్రాంతాలలో సోవియట్ యూనియన్‌తో సహా అనేక దేశాల్లో సోషలిష్టు వ్యవస్థలు కుప్పకులాయి. చైనా కూడా ఆ బాటలోనే సాగుతోంది,

మన దేశంతో సహా అనేక దేశాల్లో సామ్రాజ్యవాదుల ప్రత్యక్ష వలస స్థానంలో ప్రత్యక్షంగా పరోక్షంగా వారితో మిలాఖత్ అవుతున్న సంపన్న వర్గాలు అధికారం

చెలాయిస్తున్నాయి. మరోవైపు కమ్యూనిస్టులు, ఇతర ప్రగతిశీల శక్తులు అనేక కారణాల వలన బలహీనంగా ఉన్నాయి. ప్రపంచ విప్లవశక్తులకు తమ తమ అనుభవాల్ని పంచుకొనే కేంద్రమేలేని స్థితి ఏర్పడింది.

"కమ్యూనిస్టు మానిఫెస్టో" చాలా సంక్షిప్తమైన పత్రం, కాని దీనిలో వెలిబుచ్చిన భావాలు చాలా శక్తివంతమైనవి. కవిత్వ శైలిలో ఉన్నా ఒకసారి చదవటం, ఒక నవలలాగా చదవటం వలన ఉపయోగం లేదు. అలా చదివి జీర్ణించుకోవటం సాధ్యం కాదు.

పాల్ - ఎం - స్వీజీ లాంటి గొప్ప మేధావి "కమ్యూనిస్టు మానిఫెస్టోను నేను దాదాపు డజనుసార్లు చదివాను. కాని నాకెప్పుడూ అది పాత పుస్తకంలా అన్పించలేదు. అది ఎల్లప్పుడూ పదేపదే చదవదగిన గ్రంథం" అన్నాడు. చదివిన ప్రతిసారీ మనలో నూతన చైతన్యాన్ని కలుగచేస్తుంది.

మానిఫెస్టో ప్రచురించిన 150 సంవత్సరాలైన సందర్భంలో సమీర్ ఆమీన్ "పెట్టుబడిదారీ భూతాలు" అనే పుస్తకం రాశాడు "పెట్టుబడిదారీ విధానం సృష్టిస్తున్న అసమానతే దాని విస్తరణకు అడ్డంకి అవుతుందని మనం గుర్తించాలి. అది సాధించే తాత్కాలిక విజయాల్లోనే దాని సంక్షోభం దాగి వున్నదనే సత్యాన్ని తెల్సుకునేందుకు 'కమ్యూనిస్టు మానిఫెస్టో'ని అధ్యయనం చేయాలని" దాని ముందుమాటలో చెప్పాడు. "సంక్షోభంలో పడటం కోలుకోవటం మళ్ళీ సంక్షోభంలో పడటం తిరిగి కోలుకోవటం అనే రీతిలో పెట్టుబడి దారీ విధానం ప్రయాణం చేస్తుంది. ఈ పరిస్థితిని అర్థం చేసుకోవటానికి మనం కమ్యూనిస్టు మానిఫెస్టోని అధ్యయనం చేయాలన్నాడు.

"మానవజాతి ముందు రెండే రెండు మార్గాలు ఉన్నాయి. ఒకటి పెట్టుబడిదారీ మార్గంలో ప్రయాణంచేసి సమిష్టి ఆత్మహత్యకు తయారు కావటం లేదా ప్రపంచాన్ని వెంటాడుతున్న కమ్యూనిజం అనే భూతం దర్శకత్వంలో అనంతమైన మానవ విజయాలు సాధించటం అని సమీర్ అమీన్ అన్నారు. పెట్టుబడిదారీ విధానం విఫలమైందని గత చరిత్రంతా నిరూపించింది. దాని స్థానంలో సోషలిజం పురోగమించాలని మానిఫెస్టో నిర్దేశిస్తుంది. ఈ కారణంగా మానిఫెస్టో అధ్యయనం మరింత అవసరం.

గత ప్రచురణల్లో కార్ల్ మార్క్స్ - ఫ్రెడరిక్ ఏంగెల్స్‌లు సంయుక్తంగానూ, ఏంగెల్స్ విడిగాను రాసిన 8 ముందు మాటలున్నాయి. వాటిల్లో చాలా సమగ్రంగా ఉన్న 1888 నాటి ఇంగ్లీషు ప్రతికి రాసిన ముందు మాటను మాత్రమే ఇందులో చేర్చాం.

మా ఈ ప్రయత్నంలో పాలుపంచుకున్న డా॥ బత్తుల శివరామిరెడ్డి (శింగరాయకొండ), కొత్తపల్లి రవిబాబు (జనసాహితి), సి.యస్.ఆర్. ప్రసాద్ (విరసం), డా॥ కొల్లా రాజమోహన్ (చిలకలూరిపేట), చెరుకూరి సత్యనారాయణ (న్యాయవాది, గుంటూరు) గార్ల కు మా కృతజ్ఞతలు.

దీన్ని పుస్తక రూపంలోకి తెచ్చిన హరిబాబుగారికి, డాన్‌బోస్కో ప్రెస్ సిబ్బందికి కృజ్ఞతలు.

**కామ్రేడ్ కొల్లా వెంకయ్య**
మెమోరియల్ లైబ్రరీ
26-05-2015 పెదనందిపాడు - 522 235
గుంటూరు జిల్లా

B. j Cherukuri

# 1888 నాటి ఇంగ్లీషు కూర్పుకు ముందుమాట

'కమ్యూనిస్టు మానిఫెస్టో' కమ్యూనిస్టు లీగు[1] యొక్క వేదికగా వెలువడింది. కమ్యూనిస్టు లీగు మొదట కేవలం జర్మన్ కార్మికుల సంఘంగా వుండి, తరువాత అంతర్జాతీయ సంఘంగా యేర్పడింది, 1848 కి పూర్వం యూరోపియన్ భూఖండం (Continent) లో వుండిన రాజకీయ పరిస్థితులలో అది రహస్య సంస్థగా వుండక తప్పలేదు. 1847 నవంబర్‌లో లండన్‌లో జరిగిన లీగు మహాసభ సిద్ధాంతమూ, ఆచరణాత్మకమూ అయిన సంపూర్ణ పార్టీ కార్యక్రమాన్ని ప్రచురణ కోసం సిద్ధం చేసే పనిని మార్క్సు, ఎంగెల్సులకు అప్పగించింది. 1848 జనవరిలో జర్మన్ భాషలో రాసిన 'మానిఫెస్టో ' రాతప్రతిని ఫిబ్రవరి 24న జరిగిన ఫ్రెంచి విప్లవానికి కొద్ది వారాలు ముందుగా లండన్‌లోని ముద్రాపకునికి పంపించాము. 1848 జూన్‌లో జరిగిన తిరుగుబాటుకు కొద్ది కాలం ముందుగా పారిస్‌లో ఒక ఫ్రెంచి అనువాదం వెలువడింది. మిస్ హెలెన్ మెక్‌ఫర్లేన్ చేసిన మొదటి ఇంగ్లీషు అనువాదం జార్జి జూలియన్ హార్నేగారి Red Republican అనే లండన్ పత్రికలో 1850లో వచ్చింది. డేనిష్ భాషలోనూ, పోలిష్ భాషలోనూ కూడా రెండు కూర్పులు ప్రచురితమయ్యాయి.

1848 జూన్‌లో జరిగిన పారిస్ తిరుగుబాటు కార్మిక వర్గానికి బూర్జువా వర్గానికీ మధ్య సాగిన మొట్టమొదటి మహాయుద్ధం. అది ఓడిపోవడంతో యూరోపియన్ కార్మికవర్గం యొక్క సాంఘిక, రాజకీయ ఆకాంక్షలు మళ్ళీ కొంత కాలంపాటు మరుగునపడ్డాయి. అప్పటి నుండి మళ్ళీ అధికారం కొరకు జరిగే పోరాటం, ఫిబ్రవరి విప్లవానికి పూర్వం జరిగినట్లే, కేవలం ఆస్తిపర వర్గంలోని వివిధ భాగాల మధ్య మాత్రమే జరిగింది. కార్మికవర్గం రాజకీయ రంగంలో కొంత వెసులుబాటు కొరకే పోరాటం చేయవలసి వచ్చింది; అది మధ్యతరగతి అతివాదుల (radicals) పార్టీలో ఒక అత్యంత అతివాద బృందంగా వుండే స్థితికి పడిపోయింది. స్వతంత్ర కార్మికోద్యమాలు ఇంకా సజీవంగా వున్న లక్షణాలు ఎక్కడ కనపడినా ఆ ఉద్యమాలను క్రూరంగా వేటాడి అణచివేశారు. ఆ రోజుల్లో కొలోన్‌లో వున్న కమ్యూనిస్టు లీగు యొక్క కేంద్ర కమిటీని ప్రష్యన్ పోలీసులు వేటాడి, సభ్యులను అరెస్టు చేసి, 18 మాసాల నిర్బంధం తర్వాత 1852 అక్టోబర్‌లో

వాళ్ళ మీద విచారణ జరిపారు. ప్రసిద్ధమైన ఈ "కొలోన్ కమ్యూనిస్టుల విచారణ" అక్టోబరు 4 నుండి నవంబర్ 12 వరకు జరిగింది. ఏడుగురికి మూడేండ్ల నుండి ఆరేండ్ల వరకు జైలు శిక్ష పడింది. శిక్షపడిన వెనువెంటనే తక్కిన సభ్యులు లీగును లాంఛనంగా రద్దు చేశారు. ఇక 'మానిఫెస్టో' స్మృతి పథం నుండి మరుగు పడక తప్పదని అనిపించింది.

యూరోపియన్ కార్మికవర్గం కోలుకొని పాలకవర్గాల మీద మళ్ళీ దాడి చేయడానికి తగిన బలం పొందినప్పుడు 'అంతర్జాతీయ కార్మిక సంఘం' (మొదటి ఇంటర్నేషనల్) ఉద్భవించింది. కానీ, మొత్తం యూరప్, అమెరికాల సమరశీల కార్మికవర్గమంతటినీ ఒకే సంస్థగా ఐక్యం చేసే స్పష్టమైన ఉద్దేశ్యంతో పుట్టిన ఈ సంఘం 'మానిఫెస్టో' లోని సూత్రాలను వెంటనే ఉద్ఘాటించలేకపోయింది. ఇంగ్లీషు ట్రేడ్ యూనియన్లకూ, ఫ్రాన్స్, బెల్జియం, ఇటలీ, స్పెయిన్‌లలోని ప్రౌధన్ అనుచరులకూ, జర్మనీలోని లాసాల్ అనుచరులకూ ఆమోదయోగ్యంగా వుండేటంత విశాలమైన కార్యక్రమం 'ఇంటర్నేషనల్' కు తప్పక వుండవలసి వచ్చింది. అన్ని పార్టీలకూ సంతృప్తికరంగా వుండేలా కార్యక్రమాన్ని మార్క్స్ తయారుచేశాడు. ఆయన సంయుక్త చర్యల ద్వారానూ, పరస్పర చర్చల ద్వారానూ కార్మికవర్గ మేధా సంపద తప్పక అభివృద్ధి చెందగలదని పూర్తిగా విశ్వసించాడు. పెట్టుబడికి వ్యతిరేకంగా జరిగే పోరాటంలో సంభవించే ఘటనలూ, ఎగుడుదిగుడులే, వానిలో విజయాల కంటే ఎక్కువగా అపజయాలే తమకు ప్రీతికరమైన వివిధ చిట్కాలు పూర్తి ఫలితాలు ఇవ్వలేదనే విషయాన్ని మనుషుల మనసుల్లోకి ఎక్కేటట్లు చేసి, కార్మికవర్గ విమోచనకు గల అసలు నియమాలను సంపూర్ణంగా అవగాహన చేసుకోవడానికి దారితీస్తుంది - మార్క్స్ అనుకున్నది నిజమైంది. 1874 లో ఇంటర్నేషనల్ విచ్ఛిన్నమైనపుడు కార్మికులు 1864 లో - దానిని స్థాపించినప్పటి కంటే చాలా భిన్నంగా వున్నారు. ఫ్రాన్స్‌లో ప్రౌధానిజం, జర్మనీలో లాసాలియనిజం అంత్య ఘడియల్లో వున్నాయి. మితవాదులైన ఇంగ్లీష్ ట్రేడ్ యూనియన్లు కూడా, వాటిలో చాలా భాగం చాలా కాలం నుండి ఇంటర్నేషనల్‌తో సంబంధాలు తెంచుకొన్నాయి. వారు ఎంత వరకు పోయారంటే వాటి అధ్యక్షుడు గత సంవత్సరం స్వాన్సీలో వాటి తరఫున మాట్లాడుతూ "యూరోపియన్ భూఖండంలోని సోషలిజం మమ్మల్నిక భయపెట్టదు" అన్నాడు. నిజానికి 'మానిఫెస్టో' సూత్రాలు సకల దేశాల కార్మికుల్లోనూ గణనీయంగా చొచ్చుకొని పోయాయి.

ఆ విధంగా 'కమ్యూనిస్టు మానిఫెస్టో' మళ్ళీ ముందుకు వచ్చింది. 1850 నుండి జర్మన్ భాషలో రచించిన ఈ మానిఫెస్టో స్విట్జర్లాండు, ఇంగ్లండు, అమెరికాలలో అనేక ముద్రణలు పొందింది. 1872 లో న్యూయార్కులో ఇంగ్లీషులోకి అనువాదమై, "Woodhull and Claflin's Weekly" లో ప్రచురితమైంది. ఇంగ్లీషు పాఠం నుండి చేసిన ఒక ఫ్రెంచి అనువాదం న్యూయార్కులో "Le Socialiste" పత్రికలో వెలువడింది. అప్పటి నుండి కనీసం రెండు ఇంగ్లీషు అనువాదాలు, రెండూ అంతో యింతో వికృతరూపంతో అమెరికాలో వెలువడ్డాయి. వాటిలో ఒకటి ఇంగ్లండులో పునర్ముద్రణ పొందింది. మొదటి రష్యన్ అనువాదాన్ని బకూనిన్ చేశాడు. ఇది 1863 ప్రాంతంలో జెనీవాలో హెర్జెన్‌కు చెందిన 'కోలొకొల్' పత్రిక ఆఫీసులో ప్రచురితమైంది. వీరవనిత వేరా జసూలిచ్* చేసిన రెండవ రష్యన్ అనువాదం కూడా జెనీవాలోనే 1882 లో వెలువడింది. ఒక కొత్త డేనిష్ కూర్పు 1885 లో కోపెన్‌హాగెన్‌లోని సోషల్ డెమోక్రటిక్ బిబ్లియోథెక్‌లో వచ్చింది. ఒక కొత్త ఫ్రెంచి అనువాదం 1885 లో Le Socialiste అనే పారిస్ పత్రికలో వచ్చింది. దీని నుండి ఒక స్పానిష్ అనువాదం 1886 లో మాడ్రిడ్‌లో ప్రచురితమైంది. జర్మన్ పునర్ముద్రణలు లెక్కపెట్టలేము. అవి అన్నీ కలసి కనీసం పన్నెండైనా వుంటాయి. కొన్ని మాసాల క్రితం కాన్‌స్టంటినోపుల్‌లో అచ్చు కావలసిన ఒక ఆర్మీనియన్ అనువాదం అచ్చుకాలేదనీ, దానికి కారణం ఏమంటే మార్క్సు పేరు గల పుస్తకాన్ని ప్రచురించడానికి ప్రచురణకర్త భయపడినాడని, అనువాదకుడు అది తన స్వంత రచనగా చెప్పుకోవడానికి నిరాకరించాడనీ విన్నాను. ఇంకా యితర భాషల్లోకి అనువాదాలు జరిగినట్లు విన్నాను కానీ, వాటిని నేను చూడలేదు. ఈ విధంగా 'కమ్యూనిస్టు మానిఫెస్టో' చరిత్ర చాలా వరకు ఆధునిక కార్మికవర్గ ఉద్యమ చరిత్రను ప్రతిబింబిస్తుంది. ఈనాడు నిస్సందేహంగా ఇది సోషలిస్టు సాహిత్యంలోకెల్ల అత్యంత వ్యాప్తి గలిగి, అత్యంత అంతర్జాతీయమైన గ్రంథం; సైబీరియా నుండి కాలిఫోర్నియా వరకూ లక్షోపలక్షల శ్రామిక జనం తమ సమిష్టి వేదికగా అంగీకరించిన గ్రంథం.

కానీ, దీన్ని రచించినప్పుడు మేము దీన్ని సోషలిస్టు మానిఫెస్టో అని అనగలిగి వుండేవాళ్ళం కాదు. 1847 లో సోషలిస్టులంటే ఒక వైపున వివిధ ఊహాజనిత సిద్ధాంతాలను అనుసరించేవాళ్ళూ, అనగా ఇంగ్లండులో ఓవెన్ అనుయాయులూ, ఫ్రాన్సులో ఫోరియర్ అనుయాయులూ. ఈ ఉభయులూ ఆనాటికే కేవలం ముఠాల

(sects) స్థితికి దిగజారి, క్రమక్రమంగా అంతరించిపోతూ వున్నారు; మరొక వైపున నానా రకాల సామాజిక నాటువైద్యులు పెట్టుబడికీ, పెట్టుబడిదార్ల లాభాలకూ ఏమీ ప్రమాదం లేకుండా, రకరకాల చిట్కాలతో అన్ని రకాల సామాజిక బాధలూ తీరుస్తామని చెప్పుకునేవాళ్ళు. ఈ ఉభయవర్గాల వాళ్ళూ కార్మికవర్గ ఉద్యమంతో సంబంధం లేకుండా వుంటూ, "విద్యావంతుల" తోడ్పాటు కొరకే మొగ్గు చూపించేవాళ్ళు. కేవలం రాజకీయ విప్లవాలు పూర్తిగా సరిపోవని దృఢంగా విశ్వసించి, సంపూర్ణ సామాజిక మార్పు అవసరమని కార్మికవర్గంలో చెప్పేవాళ్ళంతా కమ్యూనిస్టులమని చెప్పుకునేవాళ్ళు. అది స్పష్టమైన రూపము పొందనిదీ, మోటుదీ, కేవలం సహజాతమూ అయిన (Instinctive) కమ్యూనిజం వంటిది; అయినా అది కీలకమైన అంశాన్ని స్పృశించి, కార్మికవర్గంలో ఎంత బలీయంగా వుందంటే, దాని ప్రభావంతో ఫ్రాన్సులో కాబెట్, జర్మనీలో వైట్లింగ్‌లు ఊహాజనిత కమ్యూనిజాన్ని సృష్టించగలిగారు. ఆ విధంగా 1847 లో సోషలిజం మధ్యతరగతి ఉద్యమంగానూ, కమ్యూనిజం కార్మికవర్గ ఉద్యమంగానూ వున్నాయి. కనీసం యూరోపియన్ భూఖండంలోనైనా సోషలిజం "గౌరవనీయం" గా వుండేది; కమ్యూనిజం అందుకు పూర్తి విరుద్ధంగా వుండేది. మొట్టమొదటి నుండి 'కార్మికవర్గ విమోచనను కార్మికవర్గమే సాధించుకోవాలి', అనేది మా అభిప్రాయం గనుక, ఈ రెండు పేర్లలో మేము దేన్ని స్వీకరించాలనే విషయంలో ఎట్టి సందేహమూ వుండజాలదు. అంతేగాక, ఆనాటి నుండి "కమ్యూనిజం" అనే పేరును మేము ఎప్పుడూ నిరాకరించదలచుకోలేదు.

ఈ 'మానిఫెస్టో' మా సంయుక్త రచన. దీనికి వెన్నెముక వంటిదైన మూల ప్రతిపాదన మాత్రం మార్క్సుదని చెప్పడం నా విధి. ఆ ప్రతిపాదన ఏదంటే, ప్రతి చారిత్రక యుగంలోనూ ఆనాడు అమల్లో వున్న ఆర్థిక ఉత్పత్తి, మారకపు విధానమూ, దాని నుండి విధిగా ఉద్భవించే సామాజిక వ్యవస్థా అనేవి పునాదిగా వుంటాయి, ఆ పునాదిపైన ఆ యుగం యొక్క రాజకీయ, బౌద్ధిక (Intellectual) చరిత్ర నిర్మాణమౌతుంది. ఆ పునాది ద్వారా మాత్రమే ఆ రాజకీయ, బౌద్ధిక చరిత్రను వివరించడం సాధ్యమౌతుంది. దీని పర్యవసానంగా మానవజాతి చరిత్ర అంతా (భూమి మీద సమిష్టి స్వామ్యం వుండే ఆదిమ తెగల సమాజం విచ్ఛిత్తి పొందినప్పటి నుండి) వర్గ పోరాటాల చరిత్రగా, అనగా పీడక, పీడిత వర్గాల మధ్య, పాలక, అణగారిన వర్గాల మధ్య జరిగే పోరాటాల చరిత్రగా వుంది. కొన్ని పరిణామాల

పరంపర అయిన ఈ వర్గపోరాటాల చరిత్ర ఈనాడు ఏ దశకు చేరిందంటే, పీడిత, అణగారిన వర్గమైన కార్మికవర్గం పీడక, పాలక వర్గమైన బూర్జువా వర్గపు పెత్తనం నుండి తాను విముక్తి పొందాలంటే మొత్తం సమాజాన్ని సమస్త దోపిడీ నుండీ, వర్గ భేదాల నుండీ, వర్గ పోరాటాల నుండీ శాశ్వతంగా విముక్తి చేయక తప్పదనే దశకు చేరింది.

డార్విన్ సిద్ధాంతం జీవ శాస్త్రానికి ఏమి చేసిందో అదే ఈ ప్రతిపాదన చరిత్రకు చేసి తీరుతుందని నా అభిప్రాయం. అటువంటి ఈ ప్రతిపాదన వైపు 1845 కు పూర్వం కొన్ని సంవత్సరాలుగా మేము ఉభయులమూ పయనిస్తూ, క్రమక్రమంగా దీన్ని సమీపిస్తూ వున్నాము. స్వతంత్రంగా నేను దీనివైపు ఎంత వరకు పురోగమించిందీ నేను రాసిన 'ఇంగ్లండులో కార్మికవర్గ స్థితి' అనే గ్రంథం ద్వారా చాలా బాగా తెలుస్తుంది. కానీ 1845 వసంతంలో, బ్రసెల్స్‌లో నేను మార్క్సును మళ్ళీ కలుసుకున్నప్పుడు, అప్పటికి తాను సిద్ధంగా తయారుచేసిన ఈ ప్రతిపాదనను, నేను ఇక్కడ ఎంత స్పష్టమైన మాటల్లో చెప్పానో దాదాపు అంత స్పష్టమైన మాటల్లో, ఆయన నా ముందు వుంచాడు.

1872 నాటి జర్మన్ కూర్పుకు మేమిద్దరమూ కలిసి రాసిన ముందుమాట నుండి ఈ కింది భాగం ఉదహరిస్తున్నాను :

"గత ఇరవై ఐదు సంవత్సరాల్లో పరిస్థితులు ఎంత మారినప్పటికీ, ఈ 'మానిఫెస్టో' లో చెప్పిన సాధారణ సూత్రాలు, మొత్తం మీద, ఎప్పటిలాగే ఇప్పటికీ సరిగా వున్నాయి. అక్కడక్కడా ఏదైనా ఒక వివరాన్ని మెరుగుపరచే అవకాశం ఉండవచ్చు. సూత్రాలను ఆచరణలో పెట్టడమనేది, ఈ 'మానిఫెస్టో' లోనే చెప్పినట్లు, సర్వే సర్వత్రా, ఆనాటి చారిత్రక పరిస్థితుల మీద ఆధారపడుతుంది; అందువల్ల 2వ ప్రకరణం చివర ప్రతిపాదించిన విప్లవ చర్యలకు ప్రత్యేక ప్రాముఖ్యం ఇవ్వలేదు. దానిని ఈనాడు రాయవలసివస్తే, అనేక విషయాలను వేరుగా రాయవలసి వుంటుంది. 1848 నుండి ఆధునిక పరిశ్రమ సాధించిన బ్రహ్మాండమైన పురోగతి దృష్ట్యానూ, దానితోపాటు కార్మికవర్గం యొక్క నిర్మాణం అభివృద్ధి చెంది విస్తరించిన దృష్ట్యానూ మొదట ఫిబ్రవరి విప్లవంలోనూ, ఆ తరువాత రెండు పూర్తి మాసాల కాలం కార్మికవర్గం రాజకీయాధికారం వహించిన పారిస్ కమ్యూన్‌లో మరింత ఎక్కువగా గడించిన అనుభవం దృష్ట్యానూ, ఈ కార్యక్రమంలోని కొన్ని వివరాలకూ కాలదోషం పట్టింది. ముఖ్యంగా ఒక విషయం పారిస్ కమ్యూన్‌లో రుజువైంది :

అదేమిటంటే 'అప్పటికే సిద్ధంగా వున్న రాజ్యాంగ యంత్రాన్ని (State Machinery) కార్మికవర్గం పూరక స్వాధీనం చేసుకొని తన సొంత ప్రయోజనాలకు ఉపయోగించుకోజాలదు'. (ఈ విషయం The Civil War in France. Address of the General Council of the International Working Men's Association. London, Truelove, 1871, 15వ పేజీ లో విపులంగా వుంది) అంతేగాక, సోషలిస్టు సాహిత్యం మీద చేసిన విమర్శ ఈనాడు అసమగ్రమని తెలుస్తూనే వుంది; ఎందుకంటే, ఆ విమర్శ 1847 వరకు మాత్రమే వర్తిస్తుంది. వివిధ ప్రతిపక్ష పార్టీల పట్ల కమ్యూనిస్టుల వైఖరిని గురించి చెప్పిన అభిప్రాయాలు (4వ ప్రకరణం) కూడా, సిద్ధాంతరీత్యా ఇప్పటికీ సరైనవే అయినప్పటికీ, ఆచరణలో వాటికి కాలదోషం పట్టిందని తెలుస్తూనే వుంది. ఎందుకంటే రాజకీయ సన్నివేశం పూర్తిగా మారిపోయి, మేము పేర్కొన్న రాజకీయ పార్టీలలో అధిక భాగాన్ని చారిత్రక పురోగతి భూమండలం నుండి ఊడ్చి పారవేసింది.

"కానీ, ఈ 'మానిఫెస్టో' ఒక చారిత్రక పత్రం అయింది. దీన్ని మార్చడానికి మాకిక ఎలాటి హక్కులేదు".

ఈ అనువాదం శామ్యూల్ మూర్‌ది. మార్క్సు రాసిన 'కాపిటల్' లో అధిక భాగాన్ని అనువాదం చేసినవాడే ఈ మూర్. మేమిద్దరమూ కలిసి దీన్ని సవరించాము. చారిత్రక విశేషాలకు కొద్ది వివరణలను నేను చేర్చాను.

లండన్, జనవరి 30, 1888

**ఫ్రెడరిక్ ఏంగెల్స్**

☆☆☆



**ప్లెహానొవ్ (1856-1918)**
**మొట్టమొదటి రష్యన్ మార్క్సిస్ట్ సంస్థ స్థాపకుడు**



**మూర్ శామ్యూల్**
**(1830-1912)**
**మొదటి ఇంటర్నేషనల్ సభ్యుడు**

# కమ్యూనిస్టు మానిఫెస్టో

యూరప్‌ను కమ్యూనిజం అనే భూతం ఆవహించింది. ఈ భూతాన్ని మంత్రశక్తితో తరిమివేయటానికి అటు పోప్[2] యిటు జారూ[3], అటు మెటర్నిక్[4] యిటు గీజో[5], అటు ఫ్రెంచి రాడికల్ పార్టీవాళ్ళూ[6] యిటు జర్మన్ పోలీసు గూఢచారులూ, అంటే పురాతన యూరప్‌లోని అధికారశక్తులన్నీ ఒక పవిత్ర కూటమిగా ఏర్పడ్డాయి.

అధికారంలో వున్న పార్టీ చేత కమ్యూనిస్టులని తిట్లుతినని ప్రతిపక్ష పార్టీ ఎక్కడైనా వుందా ? ప్రతిపక్షంలో వున్న పార్టీ అదే తిట్లను తన కంటే పురోగాములైన ఇతర ప్రతిపక్ష పార్టీల మీదా, ప్రగతి వ్యతిరేకులైన తన శత్రువుల మీదా ప్రయోగించకుండా ఎక్కడైనా వుందా ?

దీన్ని బట్టి రెండు విషయాలు స్పష్టమవుతున్నాయి.

1. కమ్యూనిజమే స్వయంగా ఒక శక్తి అని ఇప్పటికే యూరోపియన్ శక్తులన్నీ గుర్తించాయి.

2. కమ్యూనిస్టులు తమ అభిప్రాయాలనూ, లక్ష్యాలనూ, ధోరణులనూ బాహాటంగా యావత్ ప్రపంచం ఎదుటా ప్రకటించి, తమ పార్టీ మానిఫెస్టోతో కమ్యూనిస్టు భూతమనే ఈ కట్టుకథను ఎదుర్కోవలసిన సమయం ఆసన్నమైంది.

ఈ ఉద్దేశంతో వివిధ జాతుల కమ్యూనిస్టులు లండన్‌లో సమావేశమై, ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మన్, ఇటాలియన్, ఫ్లెమిష్, డేనిష్ భాషల్లో ప్రచురించడానికి ఈ 'మానిఫెస్టో' ను రూపొందించారు.

# 1

# బూర్జువాలూ - కార్మికులూ[7]

ఇప్పటివరకూ నడచిన సమాజ చరిత్ర[8] అంతా వర్గ పోరాటాల చరిత్రే.

పురాతన కాలపు స్వతంత్ర పౌరుడూ-బానిసా, రోమన్ కాలపు ప్రభువర్గీయుడూ - సామాన్యుడూ, ఫ్యూడల్ యుగపు భూస్వామ్య ప్రభువూ - అర్థ బానిసా మధ్యయుగాల నాటి వృత్తిసంఘ యజమానీ[9] – చేతివృత్తి పనివాడూ ఒక్క మాటలో చెప్పాలంటే పీడకులూ, పీడితులూ ఎల్లప్పుడూ పరస్పర శత్రువులుగా నిలబడి, ఒకప్పుడు చాటుమాటుగానూ, మరొకప్పుడు బాహాటంగానూ, నిరంతరం పోరాటం చేస్తూ వచ్చారు; ఈ పోరాటపు పర్యవసానంగా ఒకోసారి మొత్తం సమాజం విప్లవాత్మక పునర్నిర్మాణానికి లోనయ్యేది, లేదా ఒకోసారి ప్రత్యర్థి వర్గాలు రెండూ నాశనమయ్యేవి.

చరిత్ర తొలి యుగాల్లో దాదాపు ప్రతి చోటా మానవ సమాజం వివిధ తరగతులుగా, తరతమ భేదాలు గల అనేక సాంఘిక అంతస్తులుగా క్లిష్టమైన పద్ధతిలో విభజింపబడి వుండేది. పురాతన రోమ్‌లో పాలక ప్రభువులూ, యోధులూ, సామాన్యులూ, బానిసలూ వున్నారు. మధ్యయుగాలలో ఫ్యూడల్ ప్రభువులూ, సామంతులూ, వృత్తిసంఘ యజమానులూ, చేతివృత్తి పనివారూ, పని నేర్చుకొనేవారూ, అర్ధ బానిసలూ వున్నారు. దాదాపు ప్రతివర్గంలోనూ మళ్ళీ తరతమ భేదాలు వున్నాయి.

ఫ్యూడల్ సమాజపు శిథిలాలనుండి తలెత్తిన ఆధునిక బూర్జువా సమాజం వర్గ వైరుధ్యాలను నిర్మూలించలేదు. పాతవర్గాలకు బదులు కొత్త వర్గాలనూ, పాత అణచివేత పద్ధతులకు బదులు కొత్త అణచివేత పద్ధతులనూ, పాత పోరాట రూపాలకు బదులు కొత్త పోరాట రూపాలనూ నెలకొల్పడం మాత్రమే అది చేసింది.

మన ఈ బూర్జువా యుగానికి ఒక విశిష్ట లక్షణం వుంది. ఇది వర్గ వైరుధ్యాలను సులభతరం చేసింది. అంతకంతకూ మొత్తం సమాజమంతా బూర్జువా

వర్గం, కార్మికవర్గం అనే రెండు మహత్తర శత్రు శిబిరాలుగానూ, ఎదురెదురుగా నిల్చిన రెండు మహా శక్తివంతమైన వర్గాలుగానూ చీలిపోతున్నది.

మధ్యయుగాల్లోని అర్ధ బానిసల నుండి తొలి పట్టణాలలోని శాసనరక్షిత స్వతంత్ర పౌరులు[10] ఉద్భవించారు. ఈ స్వతంత్ర పౌరుల నుండే తొలి బూర్జువా శక్తులు అభివృద్ధి చెందాయి.

అమెరికా ఖండాన్ని కనిపెట్టటంతోనూ, ఆఫ్రికా ఖండాన్ని చుట్టూ తిరిగివెళ్ళే సముద్రమార్గాన్ని కనిపెట్టడంతోనూ, అప్పుడప్పుడే తల ఎత్తుతున్న బూర్జువావర్గానికి మంచి అవకాశాలు లభించాయి. తూర్పు ఇండియన్ ప్రాంత దేశాలలోనూ, చైనాలోనూ వున్న మార్కెట్లూ, అమెరికాలో తెల్లవాళ్ళు వలస ప్రాంతాలను ఏర్పరచుకోవడమూ, వలస దేశాలతో వర్తకమూ, మారకపు సాధనాలు ఎక్కువ కావడమూ – ఇవన్నీ వాణిజ్యానికి, సముద్రయానానికీ, పరిశ్రమలకూ కనీవినీ ఎరగని వూపును యిచ్చాయి. ఇందువల్ల పతనమవుతున్న ఫ్యూడల్ సమాజంలోని విప్లవ శక్తులు వేగంగా అభివృద్ధి చెందాయి.

ఫ్యూడల్ పారిశ్రామిక వ్యవస్థలో, కొత్త వాళ్ళకు ప్రవేశంలేని గిరిగీసుకొని వుండే వృత్తి సంఘాలకు పారిశ్రామిక ఉత్పత్తి మీద గుత్తాధిపత్యం వుండేది; కొత్త మార్కెట్లలో పెరుగుతున్న అవసరాలను ఆ వ్యవస్థ ఇక ఎంత మాత్రం తీర్చలేకపోయింది. దాని స్థానంలో కార్ఖానాల వ్యవస్థ[11] వచ్చింది. కార్ఖానాల ద్వారా ఉత్పత్తి సాగించే మధ్యతరగతి వచ్చి వృత్తి సంఘ యజమానులను పక్కకు నెట్టివేసింది; ప్రతి కార్ఖానాలోనూ శ్రమ విభజన ప్రవేశించడంతో వివిధ వృత్తి సంఘాల మధ్య వుండిన శ్రమ విభజన అంతరించింది.

ఈలోగా మార్కెట్లు నిరంతరం విస్తరిస్తూనే వున్నాయి. సరుకులకు గిరాకీ పెరుగుతూనే వుంది. కార్ఖానాలలో జరిగే ఉత్పత్తి కూడా చాలలేదు. అప్పుడు ఆవిరి యింజన్లూ, యంత్రాలూ వచ్చి పారిశ్రామిక ఉత్పత్తిలో విప్లవాత్మకమైన మార్పు తెచ్చాయి. కార్ఖానాలు పోయి వాటి స్థానంలో బ్రహ్మాండమైన ఆధునిక పరిశ్రమలు వచ్చాయి; పారిశ్రామిక మధ్యతరగతి పోయి, వాళ్ళ స్థానంలో పారిశ్రామిక కోటీశ్వరులు – మొత్తం కార్మిక సైన్యాల మీద అధిపతులు, అంటే ఆధునిక బూర్జువాలు వచ్చారు.

ఆధునిక పరిశ్రమ ప్రపంచ మార్కెట్‌ను స్థాపించింది; అమెరికాను కనిపెట్టటంతో దీనికి మార్గం సుగమమయింది. ఈ ప్రపంచ మార్కెట్ ద్వారా వాణిజ్యమూ, సముద్రయానమూ, భూమార్గాలూ అపారంగా అభివృద్ధి చెందాయి. వీటి అభివృద్ధి తిరిగి పరిశ్రమల విస్తరణకు కారణమయింది. ఈ విధంగా పరిశ్రమలూ, వాణిజ్యమూ, సముద్రయానమూ, రైల్వేలూ విస్తరించాయి. అదే నిష్పత్తిలో బూర్జువా వర్గమూ అభివృద్ధి అయింది. దాని పెట్టుబడీ పెరిగింది. మధ్య యుగాల నుండి వచ్చిన ప్రతి వర్గమూ వెనక్కి నెట్టివేయబడింది.

కాబట్టి, ఆధునిక బూర్జువావర్గం దీర్ఘకాలిక అభివృద్ధి ఫలితంగా ఏర్పడిందనీ, ఇది ఉత్పత్తి విధానాల్లోనూ, మారకపు విధానాల్లోనూ వచ్చిన అనేక విప్లవాల పర్యవసానమనీ మనకు అర్థమౌతున్నది.

బూర్జువావర్గం అభివృద్ధి క్రమంలో ప్రతి దశలోనూ దానికి తగినట్లుగా రాజకీయంగా కూడా పురోగమించింది. ఒకప్పుడు బూర్జువావర్గం ప్రభువర్గం పెత్తనం కింద అణగారిన వర్గంగా వుండేది; తరువాత మధ్యయుగపు కమ్యూన్లలో[12] సాయుధ స్వయం పరిపాలనా సంఘాలుగా వుండేది. అటు తర్వాత (ఇటలీలోనూ, జర్మనీలోనూ వున్నట్లు) స్వతంత్ర పట్టణ రిపబ్లిక్కులుగానో, లేక (ఫ్రాన్సులో వున్నట్లు) రాచరిక ప్రభుత్వం క్రింద పన్నులు చెల్లించే "మూడవ అంతస్తు"[13] గానో బూర్జువా వర్గం వుండేది. ఆ తర్వాత కార్ఖానాలు స్థిరపడిన కాలంలో ప్రభువర్గానికి వ్యతిరేకంగా అర్ధ ఫ్యూడల్ రాచరికాలకూ లేక నిరంకుశ రాచరికాలకూ తోడ్పడుతూ, వాస్తవానికి పెద్ద పెద్ద రాచరికాలకన్నిటికీ మూలస్తంభంగా ఈ వర్గం వుండేది. ఆ బూర్జువా వర్గమే చివరకీనాడు, ఆధునిక పరిశ్రమలూ, ప్రపంచ మార్కెట్టూ ఏర్పడినప్పటి నుండీ, ఆధునిక ప్రజాప్రాతినిధ్యపు రాజ్యంలో రాజకీయ గుత్తాధికారం సాధించుకొంది. ఆధునిక రాజ్యంలోని కార్యనిర్వాహకవర్గం మొత్తం బూర్జువావర్గపు ఉమ్మడి వ్యవహారాలను అజమాయిషీ చేసే కమిటీ మాత్రమే.

చారిత్రకంగా బూర్జువా వర్గం అత్యంత విప్లవకరమైన పాత్ర నిర్వహించింది.

బూర్జువా వర్గం పైచేయి సాధించిన ప్రతిచోటా అది అన్ని ఫ్యూడల్, పితృస్వామిక సంబంధాలనూ, గ్రామీణ ప్రాంతాలలో అజ్ఞానం, అమాయకత్వం వల్ల రూపొందిన అన్ని సంబంధాలనూ నిర్మూలించింది. మానవుణ్ణి "పుట్టుకలో

తమ కంటే అధికులైన వాళ్ళ"కు ముడివేసిన కలగాపులగపు ఫ్యూడల్ సంబంధాలను బూర్జువావర్గం నిర్దయగా పటాపంచలు చేసింది. మనిషికీ మనిషికీ మధ్య నగ్నమైన స్వలాభం తప్ప, కిరాతకమైన డబ్బు లావాదేవీ తప్ప, ఇక ఏ సంబంధాన్నీ అది మిగులనివ్వలేదు. మతావేశం వల్లా, సాహసచర్యల వల్లా పొందే ఉత్సాహంతోనూ, మూర్ఖపు భావోద్వేగాల వల్లా కలిగే అలౌకిక ఆనందాలన్నింటినీ అది స్వార్థమనే కత్తితో ఖండించి వేసింది. బూర్జువావర్గం మనిషి విలువను మారకపు విలువగా మార్చింది; రాజశాసనాలు ప్రసాదించిన అసంఖ్యాకమైన సుస్థిర స్వాతంత్ర్యాలను అంతమొందించి, వాటికి బదులు "స్వేచ్ఛా వ్యాపారం" అనే ఏకైక హేతుబద్ధంకాని స్వాతంత్ర్యాన్ని నెలకొల్పింది. ఒక్కమాటలో చెప్పాలంటే, బూర్జువావర్గం మత రాజకీయ భ్రమల ముసుగుచాటున జరిగే దోపిడీ స్థానంలో నగ్నమైన, సిగ్గులేని, ప్రత్యక్ష, పాశవిక దోపిడీని నెలకొల్పింది.

గతంలో ప్రజల భక్తి గౌరవాలకు పాత్రమైన వృత్తులకున్న గౌరవ స్థానాన్ని బూర్జువా వర్గం పటాపంచలు చేసింది. వైద్యులనూ, న్యాయవాదులనూ, పురోహితులనూ, కవులనూ, శాస్త్రవేత్తలనూ అది తనకింద పనిచేసే వేతన కూలీలుగా మార్చివేసింది.

బూర్జువావర్గం కుటుంబ వ్యవస్థ మీద వున్న మమతానురాగాల మేలి ముసుగును లాగిపారవేసి, కుటుంబ సంబంధాలను కేవలం ఆర్థిక సంబంధాలుగా దిగజార్చింది.

సనాతనవాదుల నుండి ఎన్నో ప్రశంసలు పొందిన మధ్యయుగాల నాటి పశుప్రాయమైన కార్యోత్సాహమూ, దాని వెంట, దానికి సరిగ్గా తగిన అనుబంధంగా, పరమ సోమరితనపు నిష్క్రియాపరత్వం కూడా ఏ విధంగా వున్నదీ బూర్జువావర్గం వెల్లడి చేసింది. అది మానవుని కార్యాచరణ ఎంతెంత పనులు సాధించగలిగేదీ మొట్టమొదటిసారిగా వెల్లడించింది. ఈజిప్టు పిరమిడ్లనూ,[14] రోమన్ ఆక్విడక్టులను,[15] గాథిక్[16] చర్చిలను తలదన్నే అద్భుత కార్యాలను అది సాధించింది. గతకాలపు ఆదిమ జాతుల సామూహిక వలస ప్రయాణాలనూ,[17] మత దండయాత్రలనన్నిటినీ,[18] మరపించే జైత్రయాత్రలు అది నిర్వహించింది.

ఉత్పత్తి సాధనాలను[19] నిరంతరం విప్లవీకరించకుండా బూర్జువావర్గం మనుగడ సాధించలేదు; తద్వారా ఉత్పత్తి సంబంధాలనూ, వానితో పాటు మొత్తం సామాజిక సంబంధాలనూ నిరంతరం విప్లవీకరించకుండా అది మనుగడ సాగించలేదు. ఇందుకు భిన్నంగా, గత కాలంలోని పారిశ్రామిక వర్గాలన్నీ పాత ఉత్పత్తి విధానాలను చెక్కు చెదరకుండా కాపాడుకునేవి. వాటి మనుగడకు అదే మొదటి షరతు. ఉత్పత్తిలో నిత్య విప్లవమూ, సాంఘిక పరిస్థితులలో నిరంతర కల్లోలమూ, అనంతమైన అనిశ్చిత పరిస్థితీ, ఆందోళనా - ఈ గుణాల వల్ల బూర్జువాయుగం ఇతర యుగాల నుండి ప్రధానంగా విభేదిస్తుంది. స్థిరపడి ఘనీభవించిన సంబంధాలన్నీ, వాటిని అంటిపెట్టుకుని వుండే పురాతనమైన, గౌరవనీయమైన అభిప్రాయాలూ, దురభిప్రాయాలూ అన్నీ తుడిచిపెట్టుకుపోయాయి. కొత్తగా ఏర్పడేవన్నీ, స్థిరపడకముందే పాతబడి పనికిమాలినవైపోతున్నాయి. ఘనీభవించినదనుకున్నదంతా కరిగి గాలిలో కలిసిపోతున్నది. పవిత్ర మనుకున్నదంతా మైలపడిపోతున్నది. చివరకు మానవుడు భ్రమలు తొలగించుకొని తన నిజమైన జీవన పరిస్థితులనూ, తోటి మానవులతో తనకు గల సంబంధాలనూ ఎదుర్కోక తప్పలేదు.

బూర్జువావర్గం ఉత్పత్తి చేసే సరుకులకు నిత్యం విస్తరించే మార్కెట్ కావాలి గనుక, ఆ అవసరం ఆ వర్గాన్ని ప్రపంచపు నలుమూలలకూ తరుముతోంది. ఆ వర్గం అన్నిచోట్లా గూడు కట్టుకోవాలి. అన్ని చోట్లా స్థిర నివాసం ఏర్పరచుకోవాలి, అన్ని చోట్లా సంబంధాలు నెలకొల్పుకోవాలి.

బూర్జువావర్గం ప్రపంచమంతటినీ తన మార్కెట్‌గా చేసుకోవడం ద్వారా ప్రతి దేశంలోనూ సరుకుల ఉత్పత్తికీ, వినియోగానికీ జాతి మతాతీత స్వభావం కల్పించింది. లేదా సనాతనవాదులకు తీవ్రమైన మనోవేదన కలిగేటట్లుగా అది పరిశ్రమల కాధారమైన జాతీయ పునాదిని తొలగించివేసింది. గతకాలంలో స్థాపించిన జాతీయ పరిశ్రమలన్నీ నాశనం చేయబడ్డాయి. మిగిలి వున్నవి రోజురోజుకీ నాశనం చేయబడుతున్నాయి; వాటి స్థానంలో కొత్త పరిశ్రమలు వస్తున్నాయి. ఈ పరిశ్రమలు స్థాపించటం సకల నాగరిక జాతులకూ జీవన్మరణ సమస్యగా మారింది. ఇవి దేశీయ ముడి పదార్థాలపై మాత్రమే ఆధారపడి ఇక పనిచేయలేక, సుదూర

ప్రాంతాల ముడి పదార్థాలను వినియోగించుకోసాగాయి. ఈ పరిశ్రమలలో ఉత్పత్తి అయ్యే సరుకులు స్వదేశంలోనే గాక, ప్రపంచపు నలుమూలలా వినియోగంలోకి వచ్చాయి. పాతకాలపు అవసరాలు స్వదేశపు ఉత్పత్తులతోనే తీరేవి; వాటి స్థానంలో కొత్త అవసరాలు వచ్చి దేశాంతర, ఖండాంతర వస్తువులు అవసరమైనాయి. గతంలో వివిధ ప్రాంతాలూ, వివిధ జాతులూ దేనిపాటికది ఏకాంతంగా, స్వయంసమృద్ధంగా బతికేవి. ఇప్పుడా పరిస్థితి పోయి, నలువైపులా ఇచ్చి పుచ్చుకోవడమూ, సర్వత్రా వివిధ జాతులు ఒకదానిపై ఒకటి ఆధారపడడమూ జరుగుతున్నది. భౌతిక వస్తువుల ఉత్పత్తిలో వున్న పరిస్థితే మేధోపరమైన ఉత్పత్తికి[20] కూడా వర్తిస్తుంది. వివిధ దేశాల మేధోపరమైన ఉత్పత్తులు యావత్ ప్రపంచపు సమిష్టి ఆస్తి అవుతున్నాయి. జాతీయ పాక్షికత, సంకుచిత మనస్తత్వమూ అంతకంతకూ అసంభవమౌతున్నాయి. వివిధ జాతీయ, ప్రాంతీయ సాహిత్యాల నుండి విశ్వసాహిత్యం ఉద్భవిస్తున్నది.

సమస్త ఉత్పత్తి సాధనాల సత్వరాభివృద్ధి ద్వారానూ, వార్తా రవాణా సాధనాల అపారమైన అభివృద్ధి ద్వారానూ బూర్జువావర్గం అత్యంత ఆటవిక జాతులతో సహా సకల జాతులనూ నాగరికతలోకి లాగుతుంది. బూర్జువావర్గం సరుకులను చౌకధరలకే ఉత్పత్తిచేసి, ఆ చౌకధరలు అనే భారీ ఫిరంగులతో చైనా గోడలవంటి పటిష్టమైన అడ్డంకులనన్నిటినీ కూడా పడగొట్టుంది. ఈ వర్గం విదేశీయుల పట్ల ఎంతటి మహామొండి ద్వేషంగల ఆటవికులనైనా పాదాక్రాంతం చేసుకుంటుంది. దాని నిర్బంధం వల్ల సకల జాతులూ అంతరించిపోతాయని భయపెట్టి ఆ జాతులను బూర్జువా ఉత్పత్తివిధానం అనుసరించేటట్లుగా అది బలవంతంచేస్తుంది. బూర్జువావర్గం దేనిని నాగరికతగా భావిస్తుందో దానిని అన్ని జాతులూ అనుసరించేటట్లుగా బలవంతంచేస్తుంది. అంటే అవన్నీ బూర్జువా జాతులుగా మారుతాయి. ఒక్కమాటలో చెప్పాలంటే బూర్జువావర్గం తనను పోలిన రూపంలోనే ప్రపంచాన్ని సృష్టిస్తుంది.

బూర్జువావర్గం గ్రామసీమలను పట్టణాల పెత్తనం కిందికి తెచ్చింది. అది బ్రహ్మాండమైన నగరాలను సృష్టించింది; గ్రామీణ జనాభాతో పోలిస్తే పట్టణ జనాభాను అపారంగా పెంచివేసింది; ఈ విధంగా జనాభాలో గణనీయమైన భాగాన్ని గ్రామీణ జీవిత మూఢత్వం నుండి రక్షించింది. అది ఏవిధంగా పల్లెలను పట్టణాలపై

ఆధారపడేటట్లు చేసిందో, అదే విధంగా ఆటవికదేశాలూ, అర్ధ ఆటవికదేశాలనూ నాగరికదేశాలపై ఆధారపడేటట్లు చేసింది; వ్యవసాయక జాతులను బూర్జువా జాతులపైనా, ప్రాచ్యఖండాన్ని పాశ్చాత్యఖండంపైనా ఆధారపడేటట్లు చేసింది.

ప్రజలూ, ఉత్పత్తి సాధనాలూ, ఆస్తులూ చెల్లాచెదురుగా వుండే పరిస్థితిని బూర్జువావర్గం క్రమక్రమంగా నిర్మూలిస్తూ వుంది. అది జనాభాను సమూహాలుగా చేర్చింది. ఉత్పత్తి సాధనాలను కేంద్రీకరించింది. ఆస్తిని కొద్దిమంది చేతుల్లో కేంద్రీకరించింది. దీని ఫలితంగా, విధిగా రాజకీయ కేంద్రీకరణ ఏర్పడింది. విభిన్న ప్రయోజనాలూ, శాసనాలూ, ప్రభుత్వాలూ, పన్నుల వ్యవస్థలు గలిగి, స్వతంత్రంగా వుండిన లేదా పరస్పర సంబంధాలు బలహీనంగా వుండిన రాష్ట్రాలు, ఒకే ప్రభుత్వం, ఒకే శాసనావళి, ఒకే జాతీయ వర్గ ప్రయోజనం, ఒకే (రాజకీయ) సరిహద్దూ, ఒకే సుంకాల వ్యవస్థలు గల ఒకే జాతిగా కలిపివేయబడ్డాయి.

గడిచినతరాల మానవులందరూ కలిసి సృష్టించిన ఉత్పత్తిశక్తుల[21] కంటే విస్తారమైన, బ్రహ్మాండమైన ఉత్పత్తిశక్తులను యింకా నూరేండ్లయినా నిండని తన పరిపాలనాకాలంలో బూర్జువా వర్గం సృష్టించింది. మానవునికి దాస్యం చేసే ప్రకృతి శక్తులు దాస్యం చేయడమూ, యంత్రాలూ; పరిశ్రమలకూ, వ్యవసాయానికీ రసాయనశాస్త్రాన్ని అన్వయించడమూ, ఆవిరిశక్తితో నడిచే ఓడలూ, రైళ్ళూ, టెలిగ్రాఫులు; వ్యవసాయం కోసం అడవులు నరికి మొత్తం ఖండాలనే సాగులోకి తేవడమూ, నదీజలాలను కాలువలకు మళ్ళించడమూ, మంత్రమహిమచే నేల ఈనినట్లు జనాభాలు వృద్ధికావడమూ - ఇవన్నీ పెట్టుబడిదారీ సమాజంలోనే సాధ్యమయ్యాయి. యింతటి అద్భుతమైన ఉత్పత్తి శక్తులు సామాజిక శ్రమగర్భంలో నిద్రాణమై వున్నాయని గతంలో ఎప్పుడైనా ఎవరికైనా లీలామాత్రంగానైనా తెలుసునా?

కాబట్టి మనకు తెలిసేదేమంటే : ఏ ఉత్పత్తి మారకపు సాధనాలూ,[22] పునాదిపై బూర్జువావర్గం అభివృద్ధి చెందిందో, అవి ఫ్యూడల్ సమాజంలోనే ఉద్భవించాయి. అవి క్రమంగా అభివృద్ధి చెందుతూ ఒకానొక దశకు చేరుకునేటప్పటికి, ఫ్యూడల్ సమాజపు ఉత్పత్తి, మారకపు పరిస్థితులు - అనగా ఫ్యూడల్ వ్యవసాయ వ్యవస్థకూ, ఫ్యూడల్ కార్ఖానాల పరిశ్రమల వ్యవస్థకూ - ఒక్క మాటలో చెప్పాలంటే, ఫ్యూడల్ ఆస్తి సంబంధాలకు - అప్పటికే అభివృద్ధి చెందిన

ఉత్పత్తిశక్తులతో ఇక ఏ మాత్రం పొత్తు కుదరలేదు. అవన్నీ సంకెళ్ళుగా తయారైనాయి. వాటిని బద్దలు కొట్టవలసి వచ్చింది; అవి బద్దలు కొట్టబడ్డాయి కూడా.

వాటి స్థానంలో స్వేచ్ఛాయుత పోటీ[23] ప్రవేశించింది; దాని వెంట, దాని కనుగుణమైన సామాజిక వ్యవస్థా, రాజకీయ వ్యవస్థా వచ్చాయి; బూర్జువా వర్గ ఆర్థిక రాజకీయ పెత్తనమూ వచ్చింది.

అటువంటి పరిణామమే మరొకటి ఈనాడు మన కండ్ల ఎదుట జరుగుతూ వుంది. ఈనాటి ఆధునిక బూర్జువా సమాజం బూర్జువా ఉత్పత్తి సంబంధాలూ, మారకపు సంబంధాలూ, ఆస్తి సంబంధాలతో వుంది. ఈ బూర్జువా సమాజం మంత్రించినట్లుగా బ్రహ్మాండమైన ఆ ఉత్పత్తి సాధనాలనూ, మారకపు సాధనాలనూ సృష్టించింది. అయితే తన మంత్రశక్తిచే సృష్టించిన భూతాలను తానే అదుపులో పెట్టుకోలేని భూతవైద్యుని దురవస్థలో అది పడింది. ఇప్పటికీ అనేక దశాబ్దాలుగా సాగిన పరిశ్రమల, వాణిజ్యాల చరిత్ర అంతా, బూర్జువావర్గమూ, దాని పాలనా మనగల్గటానికి తప్పనిసరైన ఆధునిక ఉత్పత్తి పరిస్థితుల మీదా, బూర్జువా ఆస్థి సంబంధాల మీదా ఆధునిక ఉత్పత్తి శక్తులు చేస్తున్న తిరుగుబాట్ల చరిత్రే. దీనికి ఉదాహరణగా, అంతకంతకు మరింత ప్రమాదకరంగా క్రమవిరామాలలో వరుసగా వచ్చే వాణిజ్య సంక్షోభాలు, మొత్తం బూర్జువా సమాజానికే చావు బతుకుల సమస్యను తెచ్చిపెడుతున్నాయని పేర్కొంటే చాలు. ఈ సంక్షోభాలు వచ్చినప్పుడల్లా అప్పటికి వున్న సరుకుల్లోనే గాక, గతంలో సృష్టించిన ఉత్పత్తి శక్తుల్లో కూడా ఎక్కువ భాగాన్ని క్రమక్రమంగా నాశనం చేయటం జరుగుతుంది. ఈ సంక్షోభ సమయాలలో మితిమీరిన ఉత్పత్తి అనే అంటురోగం ప్రబలుతున్నది. గత యుగాలన్నిటిలోనూ ఇలాంటి అధికోత్పత్తిని ఊహించటమే అసంభవం. హఠాత్తుగా మానవ సమాజం తాత్కాలికంగా ఆటవికదశలో ప్రవేశించినట్లుంటుంది; కరువో, సర్వ విధ్వంసకర ప్రపంచయుద్ధమో వచ్చి సకల జీవనాధార వస్తువుల సరఫరానూ ఆటంకపరచినట్లుంటుంది. పరిశ్రమలూ, వాణిజ్యమూ ధ్వంసమైనట్లుంటుంది. కారణం ఏమంటే మితిమీరిన నాగరికత, మితిమీరిన జీవనాధార వస్తు సంపద, మితిమీరిన పరిశ్రమలు, మితిమీరిన వాణిజ్యం. సమాజం చేతిలో వున్న ఉత్పత్తి శక్తులు ఇక ఎంత మాత్రమూ బూర్జువా ఆస్తి వ్యవస్థ అభివృద్ధికి అనుకూలంగా

లేవు; అంతేగాక, తమకు శృంఖలాలుగా తయారైన ఆ ఆస్తి వ్యవస్థ కంటే అవి బలీయమైనాయి; ఆ ఉత్పత్తి శక్తులు ఆ శృంఖలాలు తెంచుకొని బయటపడినప్పుడల్లా, వెంటనే మొత్తం బూర్జువా సమాజంలో కల్లోలం ప్రవేశిస్తుంది. బూర్జువా ఆస్తి వ్యవస్థకే ప్రమాదం ఏర్పడుతుంది. బూర్జువా సమాజపు పరిస్థితులు తాము సృష్టించిన సంపదను తనలో ఇముడ్చుకోవడానికి కూడా ఇరుకైనాయి. మరి ఈ సంక్షోభాలను బూర్జువావర్గం ఏ విధంగా అధిగమిస్తుంది? ఒక వైపున ఉత్పత్తి శక్తుల్లో ఎక్కువ భాగాన్ని బలవంతంగా ధ్వంసం చేయడం ద్వారానూ, మరొక వైపున కొత్త మార్కెట్లను జయించడం ద్వారానూ, పాత మార్కెట్లను మరింత సంపూర్ణంగా దోచుకోవడం ద్వారానూ అధిగమిస్తుంది. అంటే, మరింత విస్తృతమైన, మరింత విధ్వంసకరమైన సంక్షోభాలకు బాట వేయడం ద్వారానూ, సంక్షోభ నివారణావకాశాలను తగ్గించడం ద్వారానూ అన్నమాట[24].

బూర్జువావర్గం ఏ ఆయుధాలతో ఫ్యూడల్ సమాజాన్ని నేలకూల్చిందో ఆ ఆయుధాలే యిప్పుడు బూర్జువావర్గం మీదకు గురిపెట్టబడినాయి.

కానీ, బూర్జువావర్గం సృష్టించింది తననే నాశనం చేయగల ఆయుధాలను మాత్రమే కాదు; ఆ ఆయుధాలను చేపట్టగల మనుషులను కూడా అది సృష్టించింది. వారే ఆధునిక కార్మికవర్గం అనగా శ్రామికులు.

బూర్జువావర్గం ఏ నిష్పత్తిలో అభివృద్ధి అవుతుందో, అంటే పెట్టుబడి ఏ నిష్పత్తిలో అభివృద్ధి అవుతుందో, ఆ నిష్పత్తిలోనే శ్రామికులైన ఆధునిక కార్మికవర్గం అభివృద్ధి అవుతుంది. ఎన్నాళ్ళు పని దొరుకుతుందో అన్నాళ్ళు మాత్రమే జీవించే కార్మికులవర్గం, పెట్టుబడిని ఎన్నాళ్ళు తమ శ్రమ వృద్ధి చేయగలదో అన్నాళ్ళు మాత్రమే పని దొరికే కార్మికులవర్గం అభివృద్ధి అవుతుంది. తమ్ము తాము ఏ రోజుకారోజు అమ్ముకోవలసిన ఈ కార్మికులు యితర వర్తకపు సరుకులన్నిటిలాగే తామూ ఒక సరుకుగా అయినందున వాళ్ళు పోటీలోని ఎగుడుదిగుడులన్నిటికీ, మార్కెట్ ధరల హెచ్చుతగ్గులన్నింటికీ గురవుతారు.

యంత్రాలు విస్తృతంగా ఉపయోగంలోకి రావడంవల్లా, శ్రమ విభజనవల్లా కార్మికుల శ్రమలో వ్యక్తిగత ప్రత్యేకత అనేది పూర్తిగా అంతరించింది. అందువలన కార్మికునికి పనిలో ఏ విధమైన ఆకర్షణా లేకుండా పోయింది. కార్మికుడు యంత్రంలో

ప్రాముఖ్యత లేని భాగమయ్యాడు. అత్యంత సరళమైన, అత్యంత విసుగుపుట్టే, వైవిధ్యం లేని, ఒకే రకమైన, చాలా సులువుగా నేర్చుకోగలిగిన పనిలో మాత్రం అతనికి చాకచక్యం వుంటే చాలు. కాబట్టి ఒక కార్మికుడిని తయారుచేయడానికి అయ్యే ఖర్చు దాదాపు ఆ కార్మికుడు పొట్ట పోసుకోవడానికీ, తన సంతతిని వృద్ధి చేసుకోవడానికీ కావలసిన వాటికి మాత్రమే పరిమితమవుతుంది. కాని ఒక సరుకు ఖరీదు దాని ఉత్పత్తి ఖర్చుకు సమానంగా వుంటుంది; అనగా (కార్మికుని) శ్రమ[25] ఖరీదు కూడా దాని ఉత్పత్తి ఖర్చుకు సమానంగా వుంటుంది. కాబట్టి పని ఎంత విసుగు పుట్టించేదిగా వుంటే అంతగా కూలి తగ్గిపోతుంది. అంతేకాదు యంత్రాల వాడకమూ, శ్రమ విభజనా పెరిగే కొద్ది, అదే నిష్పత్తిలో కార్మికుని మీద పడే శ్రమభారం కూడా పెరుగుతుంది. పని గంటలు పెంచడం లేక అదే కాలంలో కార్మికునితో ఎక్కువ పని చేయించుకోవడం, లేక యంత్రాల వేగం ఎక్కువ చేయడం మొదలైన పద్ధతుల ద్వారా కార్మికుని మీద పడే శ్రమభారం పెరుగుతుంది.

ఆధునిక పరిశ్రమ పాతకాలపు పితృస్వామిక యజమాని నడిపే చిన్న కార్ఖానాను పారిశ్రామిక పెట్టుబడిదారుడు నడిపే బ్రహ్మాండమైన ఫ్యాక్టరీగా మార్చివేసింది. గుంపులు గుంపులుగా ఫ్యాక్టరీలో చేరిన కార్మిక సమూహాలను సైనిక దళాల మాదిరి నిర్మాణం చేశారు. ఈ పారిశ్రామిక కార్మిక సైన్యం మీద, అచ్చం సైన్యంలోలాగే, సార్జంట్లూ, కమాండర్లూ మొదలైన అధికార్లు తరతమ శ్రేణిలో వుంటారు. ఈ కార్మికులు కేవలం బూర్జువావర్గానికీ, బూర్జువా రాజ్యానికీ మాత్రమే బానిసలు కాదు; వీళ్ళు ప్రతి రోజూ ప్రతిగంటా యంత్రానికి బానిసలు, తనిఖీ చేసే మేస్త్రీకి బానిసలు, అన్నిటినీ మించి బూర్జువా యజమానికి బానిసలు. ఈ నిరంకుశత్వం, లాభమే తన ఏకైక లక్ష్యమని ఎంత బాహాటంగా ప్రకటించుకుంటుందో అంత అల్పంగానూ, అంత ద్వేషం కలిగించేదిగానూ, అంత విసుగు కలిగించేదిగానూ తయారవుతుంది.

ఆధునిక పరిశ్రమలు అభివృద్ధి అయ్యే కొద్దీ కార్మికుని నైపుణ్యానికీ, శారీరకశక్తి వినియోగానికీ ప్రాముఖ్యం తగ్గిపోతుంది; వాటి ప్రాముఖ్యత తగ్గే కొద్దీ యజమానులు పురుషులను తొలగించి స్త్రీలను పనిలో పెట్టుకుంటారు. లింగ వయోభేదాలు కార్మిక వర్గానికి ఇంక ఎంతమాత్రమూ ప్రత్యేక ప్రాముఖ్యత గల సామాజిక

అంశాలుగా వుండవు. అందరూ పనిచేసే సాధనాలే; వయస్సు, లింగ భేదాలను బట్టి వారి ఖరీదు ఎక్కువగానో, తక్కువగానో వుంటుంది - అంతే.

ఫ్యాక్టరీ యజమాని చెల్లించిన కూలి డబ్బులు చేతిలో పడడంతో, కార్మికునిపై జరిగే దోపిడీ అంతంకాదు. తదనంతరం అతడిని ఇంటి యజమానీ, అంగడివాడూ, వడ్డీ వ్యాపారస్తుడూ, మొదలైన ఇతర బూర్జువా దోపిడీదార్లు ముట్టడిస్తారు.

చిన్న చిన్న వ్యాపారస్తులూ, దుకాణదారులూ, రిటైరైన వర్తకులూ, చేతిపనివాళ్ళూ, రైతుల వంటి మధ్యతరగతిలోని క్రింది స్థాయికి చెందిన వారందరూ క్రమక్రమంగా కార్మికవర్గంలోకి దిగజారిపోతారు. దీనికి కొంత కారణం ఏమంటే, వీళ్ళ దగ్గర వున్న స్వల్ప పెట్టుబడి ఆధునిక పరిశ్రమలు నడపడానికి చాలదు; పెద్ద పెట్టుబడిదార్లతో పోటీకి నిలబడలేక వీళ్ళు దివాలా తీస్తారు. మరికొంత కారణం ఏమంటే, కొత్త ఉత్పత్తి పద్ధతులు అమల్లోకి వచ్చినందువల్ల చేతిపని వాళ్ళ ప్రత్యేక వృత్తి నైపుణ్యం ఎందుకూ కొరగాకుండా పోతుంది. ఈ విధంగా అన్ని తరగతుల ప్రజలూ వచ్చి కార్మికవర్గంలో కలుస్తుంటారు.

కార్మికవర్గం వివిధ దశలలో అభివృద్ధి అయింది. పుట్టుకతోనే బూర్జువావర్గంతో దాని పోరాటం ప్రారంభమవుతుంది. మొదట కార్మికులు విడివిడిగా, ఎవరిపాటికివారు పోరాడుతారు; తరువాత ఒక ఫ్యాక్టరీలోని వాళ్ళందరూ కలిసి పోరాడుతారు; ఆ తరువాత ఒకే స్థలంలో ఒకే రకమైన ఫ్యాక్టరీలలో పనిచేసే వాళ్ళందరూ కలిసిపోరాడుతారు. ఈ పోరాటాలన్నీ తమను ప్రత్యక్షంగా దోపిడీ చేసే విడివిడి బూర్జువా యజమానుల మీద జరుగుతాయి. బూర్జువా ఉత్పత్తి పరిస్థితుల మీద గాక, ఉత్పత్తి సాధనాల మీదనే కార్మికులు దాడి చేస్తారు. తమ శ్రమతో పోటీగా వచ్చే విదేశీ దిగుమతి సరుకులను ధ్వంసం చేస్తారు. యంత్రాలను ముక్కలు ముక్కలు చేస్తారు. ఫ్యాక్టరీలను దగ్ధం చేస్తారు. ఎప్పుడో అంతరించిపోయిన మధ్యయుగాల నాటి వృత్తిపనివాని హోదాను బలప్రయోగంతో పునరుద్ధరించడానికి ప్రయత్నం చేస్తారు.

ఈ దశలో కార్మికులు ఒకరికొకరికి సంబంధం లేకుండా దేశమంతటా వెదజల్లినట్లు వుంటారు; తమలో తమకు గల పోటీ మూలంగా ఎక్కడికక్కడ చీలి వుంటారు. ఎక్కడైనా వాళ్ళు ఐక్యమై, కొంతవరకు సంఘటితమైన బృందాలుగా

ఏర్పడి వుంటే, అది అప్పటికింకా వాళ్ళలో పుట్టిన ఐకమత్యం వల్ల కలిగిందేమీ కాదు, వారి ఐక్యత కూడా బూర్జువావర్గంలోని ఐకమత్యం వల్ల కలిగిందే; బూర్జువా వర్గం తన రాజకీయ స్వప్రయోజనాలు సాధించుకోవడానికి మొత్తం శ్రామికవర్గాన్ని కదిలించవలసి వుంటుంది; ఈ దశలో, కొంతకాలం పాటు, దానికలా కదిలించే శక్తి వుంటుంది కూడా. అనగా, ఈ దశలో కార్మికులు పోరాడేది తమ శత్రువులతో కాదు, తమ శత్రువుల శత్రువులతో. అంటే నిరంకుశ రాచరికపు అవశేషాలతోనూ, భూస్వాములతోనూ, పారిశ్రామికులుగాని బూర్జువాలతోనూ[26], పెటీ బూర్జువాలతోనూ వారు పోరాడతారు. ఈవిధంగా, ఈ దశలో మొత్తం చరిత్ర గతి అంతా బూర్జువావర్గం చేతుల్లో కేంద్రీకృతమై వుంటుంది; ఈ పోరాటంలో లభించే ప్రతి విజయమూ బూర్జువావర్గపు విజయమే.

కానీ, పరిశ్రమలు అభివృద్ధి అయ్యేకొద్దీ కార్మికుల సంఖ్య పెరగడమేగాక, పెద్ద పెద్ద సమూహాలుగా వాళ్ళు కేంద్రీకృతమౌతారు; వాళ్ళ బలం పెరుగుతుంది, ఆ బలాన్ని వాళ్ళు మరింతగా గుర్తిస్తారు. యంత్రాలు వచ్చి కార్మికుల శ్రమలోని ప్రత్యేక లక్షణాలన్నిటినీ రూపుమాపే కొద్దీ, దాదాపు ప్రతిచోటా కార్మికుల వేతనాలను ఒకే హీనస్థాయికి దిగలాగేకొద్దీ, కార్మికులలోని భిన్న ప్రయోజనాలూ, భిన్న జీవన పరిస్థితులూ క్రమంగా సమానమౌతాయి. బూర్జువాల మధ్య పోటీ పెరగడంవల్లా, తత్ఫలితంగా ఏర్పడే వాణిజ్య సంక్షోభాలవల్లా కార్మికుల వేతనాలు మరింత ఎగుడు దిగుడులకు గురౌతాయి. యంత్రాలలో నిరంతరం అంతకంతకూ వేగంగా జరిగే మెరుగుదలా, అభివృద్ధి వల్ల వాళ్ళ జీవన పరిస్థితి అంతకంతకూ ప్రమాదంలో పడుతుంది. వ్యక్తులుగా విడివిడిగా వున్న కార్మికులకూ, విడివిడి బూర్జువాలకూ మధ్య జరిగే ఘర్షణలు రానురాను రెండు వర్గాల మధ్య జరిగే పోరాటాలుగా పరిణమిస్తాయి. అప్పుడు బూర్జువాలకు వ్యతిరేకంగా కార్మికులు ఐక్య సంస్థలను, అంటే ట్రేడ్ యూనియన్లను ఏర్పరచుకోవడం ప్రారంభిస్తారు. తమ వేతనాల స్థాయిని నిలబెట్టుకోడానికి వారందరూ ఏకమవుతారు. అప్పుడప్పుడు జరిగే ఈ తిరుగుబాట్లకు ముందుగానే సంసిద్ధంగా వుండడానికి శాశ్వత సంఘాలు ఏర్పరచుకుంటారు. వీరి మధ్య పోటీలు అక్కడక్కడా ఘర్షణలుగా పరిణమిస్తాయి.

అప్పుడప్పుడు కార్మికులకు విజయం లభిస్తుంది. కానీ అది తాత్కాలికమే. ఆ పోరాటాల వల్ల వాళ్ళకు కలిగే నిజమైన లాభం తక్షణ ఫలితాలలో లేదు. నిత్యం విస్తరించే కార్మికవర్గ ఐక్యతే వారికి నిజమైన లాభం. ఆధునిక పరిశ్రమలు సృష్టించిన వార్తా రవాణా సాధనాలు వివిధ ప్రాంతాలలోని కార్మికుల మధ్య పరస్పర సంబంధాలు కల్పించి, కార్మికవర్గ ఐక్యతకు తోడ్పడతాయి. ఒకే స్వభావం కలిగిన అసంఖ్యాక స్థానిక పోరాటాలనన్నిటినీ సమైక్యపరచి, వర్గాల మధ్య జరిగే ఏకైక దేశవ్యాప్త పోరాటంగా రూపొందించడానికి సరిగ్గా ఈ పరస్పర సంబంధమే కావలసి వుంది. కానీ, ప్రతివర్గ పోరాటమూ ఒక రాజకీయ పోరాటమే. ఇక దరిద్రపు రహదారులు గల మధ్య యుగాల్లో పట్టణ పౌరులు (Burghers) ఐక్యత సాధించడానికి కొన్ని శతాబ్దాలు పట్టగా, ఆధునిక కార్మికులు రైల్వేల మూలంగా కొద్ది సంవత్సరాలలోనే ఆ ఐక్యతను సాధిస్తారు.

కార్మికుల మధ్య వారిలో వారికే వున్న పోటీ వల్ల వారు ఒక వర్గంగా సంఘటితపడటమూ, పర్యవసానంగా ఒక రాజకీయ పార్టీగా సంఘటితమవటమూ నిరంతరం ఒడిదుడుకులకు లోనవుతూ వుంటుంది. కానీ, కార్మికవర్గం మరింత బలంగా, మరింత స్థిరంగా మహత్తరశక్తితో మళ్ళీ పైకి లేస్తుంది. బూర్జువావర్గంలోని చీలికలను ఉపయోగించుకొని, అది కార్మికుల ప్రత్యేక ప్రయోజనాలను శాసనాల పరంగా ప్రభుత్వం గుర్తించేటట్లు చేస్తుంది. ఈ విధంగా ఇంగ్లండులో పది గంటల పని బిల్లు[27] ఆమోదింపబడింది.

మొత్తం మీద పాత సమాజంలోని వర్గాల మధ్య జరిగే సంఘర్షణలు అనేక విధాలుగా కార్మికవర్గ అభివృద్ధికి తోడ్పడతాయి. బూర్జువావర్గం నిరంతర యుద్ధంలో చిక్కుకొని వుంటుంది - మొదట ఫ్యూడల్ ప్రభువర్గంతోనూ, తరువాత బూర్జువావర్గంలోనే పరిశ్రమల అభివృద్ధికి నష్టం కలిగించే బూర్జువావర్గాలతోనూ[28] మొదటి నుండి చివరదాకా విదేశ బూర్జువా వర్గాలతోనూ నిరంతరం యుద్ధాలలో మునిగి ఉంటుంది. ఈ యుద్ధాలన్నిటిలోనూ కార్మికవర్గ సహాయం అర్థించక తప్పదని బూర్జువా వర్గం గుర్తిస్తుంది. ఈ విధంగా అది కార్మికవర్గాన్ని రాజకీయ రంగంలోకి లాగుతుంది. ఆవిధంగా బూర్జువావర్గమే తన రాజకీయ విద్యనూ, సాధారణ విద్యనూ కార్మికవర్గానికి నేర్పుతుంది. అనగా, బూర్జువావర్గంతో యుద్ధం

చేయడానికి కావలసిన ఆయుధాలను కార్మికవర్గానికి బూర్జువావర్గమే అందిస్తుంది.

అంతేకాదు, యింతకుముందే చెప్పినట్లు పరిశ్రమలు పురోగమించేకొద్దీ, పాలకవర్గాలలోని అనేక శ్రేణులు కార్మికవర్గంలోకి తోయబడతాయి. చేరక తప్పని స్థితి ఏర్పడుతుంది. లేదా కనీసం, ఆ శ్రేణుల మనుగడకు ప్రమాదకర పరిస్థితి ఎదురవుతుంది. ఈ శ్రేణులు కూడా కార్మికవర్గానికి నూతన విజ్ఞానాన్నీ, నూతన ప్రగతి లక్షణాలనూ అందిస్తాయి.

చివరి అంశం ఏమంటే, వర్గ పోరాటం అటో యిటో తేలిపోయే సమయం సమీపించినప్పుడు, పాలకవర్గంలో సాగుతున్న విచ్ఛిత్తి ప్రక్రియ – నిజానికి పాత సమాజం అంతటా సాగుతున్న విచ్ఛిత్తి ప్రక్రియ – స్పష్టమైన, ప్రచండమైన రూపం ధరిస్తుంది. దాని ఫలితంగా పాలకవర్గంలోనే కొద్దిమంది తమ వర్గంతో సంబంధాలు తెంచుకొని వచ్చి, భవిష్యత్తును శాసించే విప్లవవర్గంతో కలుస్తారు. అనగా, గతంలో యే విధంగా ఫ్యూడల్ ప్రభువర్గానికి చెందిన ఒక భాగం విడిపోయి వచ్చి బూర్జువా వర్గంతో కలిసిందో, అదే విధంగా యిప్పుడు బూర్జువా వర్గానికి చెందిన ఒక భాగం విడిపోయి వచ్చి కార్మికవర్గంతో కలుస్తుంది. ముఖ్యంగా మొత్తం చారిత్రక గతినంతటినీ సిద్ధాంతరీత్యా అవగాహన చేసుకోగల స్థాయికి చేరుకున్న బూర్జువా సిద్ధాంతవేత్తలలో ఒక భాగం కార్మికవర్గంతో కలుస్తుంది.

ఈనాడు బూర్జువావర్గానికి ముఖాముఖిగా నిలబడిన వర్గాలన్నిటిలోనూ కార్మికవర్గం ఒక్కటే నిజమైన విప్లవ వర్గం. తక్కిన వర్గాలు ఆధునిక పరిశ్రమల ప్రభావంవల్ల క్షీణించి క్షీణించి చివరకు అదృశ్యమౌతాయి. కార్మికవర్గం ఆధునిక పరిశ్రమల ప్రత్యేక సృష్టియే గాక అతిముఖ్య సృష్టి కూడా.

మధ్యతరగతిలో కింది శ్రేణికి చెందినవాళ్ళూ, చిన్న చిన్న పరిశ్రమల యజమానులూ, దుకాణదారులూ, చేతి పనివాళ్ళూ, రైతులూ, వీళ్ళందరూ బూర్జువా వర్గంతో పోరాడుతారు; కానీ వీళ్ళ పోరాటమంతా మధ్యతరగతిలో భాగంగా తమ వునికిని కాపాడుకోవటం కోసమే. కనుక వీళ్ళు విప్లవకారులు కాదు, యథాస్థితివాదులు. అంతేకాదు, ప్రగతి వ్యతిరేకులు కూడా; ఎందుకంటే వీళ్ళు చరిత్రగతిని వెనక్కు తిప్పడానికి ప్రయత్నిస్తారు. ఒకవేళ వీళ్ళు ఎప్పుడైనా

విప్లవకరంగా వున్నారంటే, త్వరలోనే తాము కార్మికవర్గంలో కలిసిపోయే ప్రమాదం ఉన్న దృష్ట్యా మాత్రమే వారు అలా వుంటారు; అనగా వీళ్ళు పోరాడేది తమ ప్రస్తుత ప్రయోజనాల రక్షణ కొరకు కాదు; భవిష్యత్ ప్రయోజనాల కొరకు వారు పోరాడుతారు. వారు తమ సొంత దృక్పథాన్ని వదలివేసి, కార్మికవర్గ దృక్పథం స్వీకరిస్తారు.

పాత సమాజపు అట్టడుగు పొరల నుండి వెలికి త్రోయబడి, ఒడ్డున నిర్జీవంగా కుళ్ళిపోతున్నటువంటి "ప్రమాదకర వర్గం[29]", అక్కడక్కడా కార్మికవర్గ విప్లవోద్యమ ప్రవాహంలోకి కొట్టుకురావచ్చు. కానీ, దాని జీవన పరిస్థితులను బట్టి ఆ వర్గం ప్రగతి నిరోధకుల దగ్గర వారి కుతంత్రాలు నెరవేర్చే అవినీతికర పరికరంగా వుండటానికే ఎక్కువ అవకాశాలు వున్నాయి.

కార్మికవర్గ పరిస్థితులలో పాత సమాజపు పరిస్థితులు ఇప్పటికే దాదాపు పూర్తిగా అణగారిపోయాయి. కార్మికునికి ఆస్తి అనేది లేదు; భార్యాబిడ్డలతో అతనికి గల సంబంధానికీ, బూర్జువా కుటుంబాలలో వుండే సంబంధాలకూ ఇక ఎక్కడా పోలికలేదు. ఆధునిక పారిశ్రామిక శ్రమ విధానం – అనగా పెట్టుబడికి లోబడి వుండే ఆధునిక దాస్యం – ఫ్రాన్సులో ఎలా ఉందో ఇంగ్లండులోనూ అంతే, జర్మనీలో ఎలా ఉందో అమెరికాలోనూ అంతే. ఈ ఆధునిక శ్రమవిధానం కార్మికునికి జాతీయ స్వభావం అనేది మచ్చుకు కూడా లేకుండా తొలగించివేసింది. న్యాయశాస్త్రం, నీతి, మతం అనేవి అన్నీ బూర్జువా గుడ్డి నమ్మకాలనీ, ఒక్కొక్క దాని చాటున ఒక్కొక్క బూర్జువా స్వార్థం పొంచి వుందనీ కార్మికుని అవగాహన.

ఇంతవరకు అధికారం సంపాదించిన వర్గాలన్నీ ఆస్తిని సొంతం చేసుకొనే తమ దోపిడీ పద్ధతులను సమాజమంతటి మీదా రుద్దడం ద్వారా సమాజంలో అప్పటికే తాము సాధించుకొన్న హోదాను భద్రపరచుకోవడానికి ప్రయత్నించాయి. కార్మికులు తమ పాత ఆస్తి సంపాదనా పద్ధతులతో పాటు, ఇతర పాత ఆస్తి సంపాదనా పద్ధతులన్నిటిని రద్దుచేస్తే తప్ప, సమాజపు ఉత్పత్తి శక్తులకు యజమానులు కాలేరు. కార్మికులకు భద్రపరచుకోవడానికీ, పదిలపరచుకోవడానికీ ఏమీ లేదు; వాళ్ళ జీవిత లక్ష్యం సొంత ఆస్తికి గతంలో వున్న సకల భద్రతలనూ, సకల రక్షణలనూ ధ్వంసం చేయడమే.

చరిత్రలో యింతవరకు జరిగిన ఉద్యమాలన్నీ అల్ప సంఖ్యాకుల ఉద్యమాలు లేదా అల్ప సంఖ్యాకుల ప్రయోజనాల కొరకు జరిగిన ఉద్యమాలు. ఈనాటి కార్మికవర్గ ఉద్యమం అత్యధిక సంఖ్యాకుల ప్రయోజనాల కొరకు అత్యధిక సంఖ్యాకులు బుద్ధిపూర్వకంగా, స్వతంత్రంగా నడిపే ఉద్యమం. మన ప్రస్తుత సమాజంలో అట్టడుగు పొర అయిన కార్మికవర్గం కదలాలంటే, లేచి నిలబడాలంటే, తన మీద వున్న అధికార సమాజపు పై పొరలనన్నింటినీ మొత్తంగా ఆకాశంలోకి ఎగరగొట్టక తప్పదు.

కార్మికవర్గం బూర్జువావర్గంతో చేసే పోరాటం, మొదటి దశలో, సారాంశంలో కాకపోయినా రూపంలో, జాతీయ పోరాటంగా వుంటుంది. ఏ దేశపు కార్మికవర్గమైనా మొదట తన దేశపు బూర్జువావర్గంతోనే వ్యవహారాలు తేల్చుకోవలసి వుంటుంది.

ఇంతవరకు కార్మికవర్గం అభివృద్ధిలోని సర్వసాధారణ దశలు చిత్రించాం. ఆ చిత్రణలో ప్రస్తుత సమాజంలో మొత్తం మీద ప్రచ్ఛన్నంగా రగులుతున్న అంతర్యుద్ధం బహిరంగ విప్లవంగా ప్రజ్వలించే దశ వరకూ, బూర్జువా వర్గాన్ని బలప్రయోగంతో కూలదోయడం ద్వారా కార్మికవర్గ అధికారానికి పునాదులు పడే దశ వరకూ చిత్రించాం.

గత చరిత్రలో, మనం యిప్పటికే గమనించినట్లు, ప్రతి సమాజమూ పీడిత పీడక వర్గాల మధ్య వుండే వైరుధ్యం మీద ఆధారపడింది. కానీ ఒక వర్గాన్ని పీడించాలంటే, ఆ పీడితవర్గం కనీసం తన బానిస బతుకును యథాస్థితిలో కొనసాగించడానికైనా కొన్ని పరిస్థితులు నమ్మకంగా ఉండాలి. ఫ్యూడల్ యుగంలోని అర్ధ బానిసలు కమ్యూన్‌లో[30] సభ్యత్వం పొందే స్థితికి అభివృద్ధి చెందారు; ఫ్యూడల్ నిరంకుశ పెత్తనం కింద పెటీ బూర్జువాలు బూర్జువాలుగా అభివృద్ధి చెందారు. కానీ, ఆధునిక కార్మికుడు పరిశ్రమలు అభివృద్ధి అయ్యేకొద్దీ వాటితో పాటు అతడు కూడా పైకి ఎదగకుండా యింకా కిందికి పోతున్నాడు; కార్మిక జీవన పరిస్థితుల కంటే దినదినం ఇంకా కిందకు జారిపోతున్నాడు. కార్మికుడు బుక్కాఫకీరవుతున్నాడు. వారి పేదరికం జనసంఖ్య కంటే, దేశ సంపద కంటే చాలా వేగంగా పెరుగుతున్నది. కాబట్టి ఒక విషయం స్పష్టమౌతోంది. సమాజంలో పాలకవర్గంగా వుండడానికి బూర్జువావర్గానికి ఇక ఎంత మాత్రమూ యోగ్యత లేదు; తన జీవిత విధానాన్ని,

అత్యున్నత శాసనంగా, సమాజం మీద నిరంకుశంగా రుద్దడానికి బూర్జువావర్గానికి ఇక ఎంత మాత్రమూ అర్హత లేదు. తన బానిసత్వంలోనయినా మనగలగడానికి తన బానిసకు అవకాశం కల్పించలేని ఈ చేతకాని వర్గానికి పరిపాలించే అర్హతలేదు. అతడిచేత పోషించవలసిన తాను, అతడినే పోషించవలసిన దుస్థితిలోకి నెట్టివేయబడక తప్పని స్థితి నెలకొన్నప్పుడు, ఆ బూర్జువావర్గం అధీనంలో సమాజం ఇంక ఎంతమాత్రమూ మనలేదు. అనగా, సమాజానికీ, బూర్జువావర్గం ఉనికికీ ఇక ఎంత మాత్రం పొత్తు కుదరదు.

పెట్టుబడి ఏర్పడటమూ, వృద్ధికావడమూ అనే ప్రధానపరిస్థితి పైనే బూర్జువావర్గమూ, దాని పరిపాలనా ఆధారపడి వుంటుంది. పెట్టుబడి వుండాలంటే వేతనశ్రమ తప్పనిసరిగా వుండాలి. కార్మికుల మధ్య వుండే పోటీ మీదనే వేతనశ్రమ సంపూర్ణంగా ఆధారపడుతుంది. కానీ, బూర్జువావర్గపు అసంకల్పిత తోడ్పాటుతోనే పరిశ్రమల పురోగమనం సాగుతుంది. దాని మూలంగా కార్మికులలో పరస్పరపోటీ వల్ల ఏర్పడే అనైక్యత పోయి, ఆ స్థానంలో పరస్పర సాహచర్య ఫలితంగా విప్లవకరమైన ఐక్యత వస్తుంది. అనగా, ఏ పునాదుల మీద బూర్జువా వర్గం వస్తుసంపదను ఉత్పత్తి చేసి సొంతపరచుకుంటున్నదో ఆ పునాదులనే ఆధునిక పరిశ్రమాభివృద్ధి కూల్చివేస్తుంది. కాబట్టి బూర్జువావర్గం ఉత్పత్తి చేసే వాటిలోకెల్లా ముఖ్యమైనదేదంటే, తనకు గోరీ కట్టే వాళ్ళను తానే ఉత్పత్తి చేయడం. బూర్జువావర్గ పతనమూ, కార్మికవర్గ విజయమూ రెండూ అనివార్యమే.

## 2

# కార్మికులూ - కమ్యూనిస్టులూ

మొత్తం కార్మికవర్గంతో కమ్యూనిస్టుల సంబంధం ఏ విధంగా వుంటుంది?

కమ్యూనిస్టులు ఇతర కార్మికవర్గ పార్టీలకు వ్యతిరేకమైన మరొక ప్రత్యేక పార్టీగా ఏర్పడరు.

కార్మికవర్గ సమిష్టి ప్రయోజనాలకు భిన్నంగా, విడిగా కమ్యూనిస్టులకెలాంటి ఇతర ప్రయోజనాలూ లేవు.

కార్మికవర్గ ఉద్యమాన్ని తమకు నచ్చిన రూపంలో, మూసలో తయారుచేయడానికి వారు ఎలాంటి సొంత పిడివాద సూత్రాలనూ రూపొందించరు.

కమ్యూనిస్టులకూ, ఇతర కార్మికవర్గ పార్టీలకూ మధ్య ఈ కింది అంశాలలో మాత్రమే భేదం వుంది :

1) వివిధ దేశాల కార్మికులు చేసే జాతీయ పోరాటాలలో, జాతీయతతో నిమిత్తం లేకుండా సమస్త కార్మిక వర్గానికీ గల సమిష్టి ప్రయోజనాలను కమ్యూనిస్టులు గుర్తు చేసి, వాటికి ప్రాధాన్యం ఇస్తారు.

2) బూర్జువావర్గంతో కార్మికవర్గం చేసే పోరాటం వివిధ దశలుగా అభివృద్ధి చెందుతుంది; ఆ అన్ని దశల్లోనూ కమ్యూనిస్టులు ఎల్లప్పుడూ, అన్ని ప్రాంతాలలోనూ మొత్తం ఉద్యమ ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహిస్తారు.

కాబట్టి కమ్యూనిస్టులు ఒకవైపున, ఆచరణరీత్యా ప్రతి దేశంలోనూ వున్న కార్మికవర్గపార్టీలన్నిటిలోకీ అత్యంత పురోగామి, అత్యంత దీక్షాపూరితమైన భాగంగానూ, యితర భాగాలన్నిటినీ ముందుకు నడిపించేవారిగానూ వుంటారు; మరొకవైపున, సిద్ధాంతరీత్యా, కార్మికోద్యమం పయనించే మార్గమూ, దాని నియమాలూ, దాని సాధారణ అంతిమ ఫలితాలూ వారు స్పష్టంగా అర్థం చేసుకుంటారు. కాబట్టి ఈ విషయంలో బహుసంఖ్యాక కార్మిక జనసామాన్యానికి లేని సానుకూలత వారికి వుంటుంది.

కమ్యూనిస్టుల తక్షణ లక్ష్యం కూడా యితర కార్మికవర్గ పార్టీలకున్న లక్ష్యమే; కార్మికులు ఒక వర్గంగా రూపొందడం, బూర్జువా ఆధిపత్యాన్ని కూలదోయడం, కార్మికవర్గం రాజకీయాధికారాన్ని సాధించుకోవటం.

జగత్తునంతటినీ సంస్కరించదలచిన ఏ మహానుభావుడో సృష్టించిన లేక ఆవిష్కరించిన భావాలమీదనో లేక సూత్రాలమీదనో కమ్యూనిస్టుల సైద్ధాంతిక నిర్ధారణలు ఏవిధంగానూ ఆధారపడవు.

ఈ నిర్ధారణలు ప్రస్తుత వర్గపోరాటాల నుండి, సాక్షాత్తుగా మన కళ్ళ ముందు జరుగుతున్న ఒక చారిత్రక ఉద్యమం నుండి ఉత్పన్నమౌతున్న వాస్తవ సంబంధాలను స్థూలంగా వ్యక్తపరుస్తాయి అంతే. ప్రస్తుతం ఉనికిలో వున్న ఆస్తి సంబంధాలను రద్దు చేయడం కమ్యూనిజం ప్రత్యేక లక్షణమేమీ కాదు.

చారిత్రక పరిస్థితులలో వచ్చిన మార్పుల ఫలితంగా, ఆస్తి సంబంధాలన్నీ గతంలో కూడా నిరంతరం మారుతూనే వచ్చాయి.

ఉదాహరణకు, ఫ్రెంచి విప్లవం బూర్జువా ఆస్తికి అనుకూలంగా ఫ్యూడల్ ఆస్తిని రద్దు చేసింది.

కమ్యూనిజం ప్రత్యేక లక్షణం ఏ ఆస్తినైనా రద్దుచేయటం కాదు; బూర్జువా ఆస్తిని రద్దు చేయడం దాని ప్రత్యేక లక్షణం. కానీ, వర్గ వైరుధ్యాల మీదా, అధిక సంఖ్యాకులను అల్ప సంఖ్యాకులు చేసే దోపిడీ మీదా ఆధారపడి ఉత్పత్తులను ఉత్పత్తి చేసి, సొంత పరచుకొనే వ్యవస్థ రూపాలలోకెల్లా ఆధునిక బూర్జువా సొంత ఆస్తి అనేది ఆఖరిదీ, అత్యంత పరిపూర్ణమైనదీ.

ఈ అర్థంలో కమ్యూనిస్టుల సిద్ధాంతాన్ని ఒక్క వాక్యంలో క్లుప్తీకరించవచ్చు; సొంత ఆస్తిని రద్దు చేయడమే వారి సిద్ధాంతం.

మానవులు సకల విధాల వ్యక్తిగత స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, కార్యాచరణ ఆధారంగా ఆస్తిని సంపాదించుకొంటారనీ, ఆవిధంగా వారు స్వయంకృషిచేత ఆస్తి సంపాయించుకునే హక్కును రద్దు చేయదలచుకున్నామని కమ్యూనిస్టులమైన మా మీద నిందలు వేస్తున్నారు.

ఆస్తి చాలా కష్టపడి, స్వయంగా సంపాదించి కూడబెట్టుకున్నదట ! బూర్జువా ఆస్తి అనేది రాకపూర్వమే చిన్న రైతులూ, చిన్న చేతి పనులవాళ్ళూ సంపాదిస్తూ వున్న ఆస్తి గురించేనా మీరనేది? అదే అయితే, దాన్ని రద్దు చేయవలసిన అవసరం లేదు; పరిశ్రమల అభివృద్ధి దానిని ఇప్పటికే చాలా వరకు నాశనం చేసింది. మిగిలిన దానిని కూడా రోజూ నాశనం చేస్తూనే వున్నది.

లేక, మీరనేది ఆధునిక బూర్జువా సొంత ఆస్తిని గురించా ?

అయితే, వేతనశ్రమ కార్మికునికి ఏమైనా ఆస్తిని సృష్టిస్తుందా ? లేదు, అణుమాత్రం కూడా లేదు. వేతనశ్రమ పెట్టుబడిని సృష్టిస్తుంది. పెట్టుబడి అంటే వేతనశ్రమను దోపిడీ చేసేటటువంటి ఆస్తి. కొత్తగా దోపిడీ చేయడానికి కొత్త కార్మికులను సృష్టిస్తే తప్ప వృద్ధికాలేని ఆస్తి అది. ప్రస్తుత రూపంలో ఉన్న ఆస్తి పెట్టుబడికీ, వేతనశ్రమకీ గల వైరుధ్యం మీద ఆధారపడి వుంది. ఈ వైరుధ్యంలో ఉన్న రెండు పార్శ్వాలనూ పరిశీలిద్దాం.

పెట్టుబడిదారుడుగా వుండడమంటే ఉత్పత్తిలో కేవలం వ్యక్తిగత హోదాయేగాక, ఒక సామాజిక హోదా కలిగి వుండడమన్నమాట. పెట్టుబడి అనేది సమిష్టి శ్రమ ఫలితం. అనేక మంది కలిసి చేసే సమైక్య కృషివల్లనే, ఇంకా చెప్పాలంటే, సమాజంలోని సభ్యులందరి సమైక్య కృషి వల్లనే పెట్టుబడి చలనంలో వుంటుంది.

అందుచేత పెట్టుబడి అనేది వ్యక్తిగతమైన శక్తి కాదు, అది ఒక సామాజిక శక్తి.

కాబట్టి పెట్టుబడి సమిష్టి ఆస్తిగా మార్చబడినప్పుడు అంటే సమాజంలోని సభ్యులందరి ఆస్తిగా మార్చబడినప్పుడు, వ్యక్తిగత ఆస్తి సామాజిక ఆస్తిగా మారడంలేదు. ఆస్తియొక్క సామాజిక స్వభావంలో మాత్రమే మార్పు వస్తుంది. ఆస్తి తన వర్గస్వభావం కోల్పోతుంది.

ఇక వేతన శ్రమను పరిశీలిద్దాం.

కార్మికునికిచ్చే కనీసవేతనమే అతని వేతన శ్రమ సగటు ఖరీదు. అంటే, కార్మికుడు కార్మికుడుగా కనీస స్థాయిలో బతకాలంటే తప్పనిసరిగా కావలసిన జీవితావసరాల ఖరీదు. కాబట్టి కూలిపని చేసే కార్మికుడు తన శ్రమద్వారా

సంపాదించేది కేవలం తన మనుగడనూ, తన సంతానాన్నీ కనీస స్థాయిలో నిలుపుకోవడానికి బొటాబొటిగా సరిపోతుంది. శ్రమ ఫలితమైన ఈ సొంత సంపాదన కేవలం తన మనుగడకూ, వంశాభివృద్ధికి మాత్రమే సరిపోతుంది. అందులో కొంత మిగిలించుకొని, ఆ మిగులు డబ్బుతో ఇతరుల శ్రమన్ను దోచుకోవడానికి ఏమాత్రము వీలుకాని సొంత సంపాదన ఇది. దీన్ని రద్దు చేయడం ఎంత మాత్రమూ మా ఉద్దేశం కాదు. మేము రద్దు చేయదలచుకున్నదల్లా, ఈ ఆస్తిని సొంతం చేసుకొనే విధానంలోని ఏ దౌర్భాగ్య స్వభావం వలన కార్మికుడు పెట్టుబడిని వృద్ధి చేయడానికి మాత్రమే బతుకుతాడో, ఏ దౌర్భాగ్య స్వభావం వలన పాలకవర్గం తనకు లాభకరంగా వున్నంత వరకు మాత్రమే కార్మికుని బతకనిస్తుందో, ఆ దౌర్భాగ్య స్వభావాన్ని మాత్రమే.

బూర్జువా సమాజంలో, సజీవ శ్రమ[31] పోగుబడిన శ్రమను[32] వృద్ధి చేసే సాధనం మాత్రమే. కమ్యూనిస్టు సమాజంలో పోగుబడిన శ్రమ శ్రమపడేవాని జీవితాన్ని విస్తృతపరచడానికీ, సంపన్నం చేయడానికీ, ప్రోత్సహించడానికీ సాధనంగా ఉపయోగపడుతుంది.

కాబట్టి, బూర్జువా సమాజంలో గతం వర్తమానాన్ని శాసిస్తుంది. కమ్యూనిస్టు సమాజంలో వర్తమానం గతాన్ని శాసిస్తుంది. బూర్జువా సమాజంలో పెట్టుబడికి స్వాతంత్ర్యమూ, వ్యక్తిత్వమూ వుంటాయిగాని, సహజమైన మనిషికి స్వాతంత్ర్యమూ, వ్యక్తిత్వమూ వుండవు. అతడు పరాధీనుడు.

ఈ స్థితినే మేము రద్దు చేయాలనేది. దీన్ని రద్దు చేయడమే వ్యక్తిత్వాన్ని రద్దు చేయడమనీ, స్వేచ్ఛను రద్దు చేయడమనీ బూర్జువాలు అంటారు ! నిజమే మరి. నిస్సంశయంగా మా లక్ష్యం బూర్జువా వ్యక్తిత్వాన్నీ, బూర్జువా స్వాతంత్ర్యాన్నీ, బూర్జువా స్వేచ్ఛనూ రద్దు చేయడమే.

ప్రస్తుత బూర్జువా ఉత్పత్తి వ్యవస్థలో స్వేచ్ఛ అంటే వ్యాపారానికి స్వేచ్ఛ, క్రయ విక్రయాలకు స్వేచ్ఛ.

కానీ, క్రయవిక్రయాలే అంతరించినప్పుడు, స్వేచ్ఛగా జరిగే క్రయవిక్రయాలు కూడా అంతరిస్తాయి. క్రయ విక్రయాల స్వేచ్ఛను గురించి మాట్లాడే యీ మాటలకూ,

యింకా సర్వసామాన్య అర్థంలో స్వేచ్ఛను గురించి మన బూర్జువాలు చేసే "గంభీరోపన్యాసా" లకూ ఏమైనా అర్థం అంటూ వుంటే, మధ్య యుగాలనాటి వర్తకుల మీద వుండిన నిర్బంధాలతోనూ, వాళ్ళ క్రయ విక్రయాల మీద వుండిన పరిమితులతోనూ, పోల్చి చూసినపుడు మాత్రమే కొంత అర్థం వుందనవచ్చు. కానీ, క్రయ విక్రయాలనే రద్దు చేయాలనీ, బూర్జువా ఉత్పత్తి వ్యవస్థనే రద్దు చేయాలనీ, అసలు బూర్జువావర్గాన్నే రద్దు చేయాలనే కమ్యూనిస్టు సిద్ధాంతం ముందు ఆ మాటలకు అర్థమే లేదు.

సొంత ఆస్తిని మేము రద్దు చేయాలనడం మీకు ఎంతో భయోత్పాతాన్ని పుట్టిస్తున్నది. కానీ యిప్పుడున్న మీ సమాజంలో నూటికి తొంభై మందికి సొంత ఆస్తి యిప్పటికే రద్దయిపోయింది; ఆ తొంభై శాతం మందికి లేదు గనుకనే, తక్కిన కొద్ది మందికీ స్వంత ఆస్తి వుండగలుగుతున్నది. అనగా, సమాజంలో అత్యధిక సంఖ్యాకులకు ఏ విధమైన ఆస్తీ లేనప్పుడు మాత్రమే మనగల ఆస్తి వ్యవస్థను మేము రద్దు చేయదలచుకున్నందుకు మీరు మమ్మల్ని నిందిస్తున్నారన్నమాట.

ఒక్కమాటలో చెప్పాలంటే, మీ ఆస్తిని రద్దు చేయదలచుకున్నామని మమ్మల్ని మీరు నిందిస్తున్నారు. ఔను, మేము చేయదలచుకున్నది సరిగ్గా అదే.

కార్మికశ్రమను పెట్టుబడిగానూ, డబ్బుగానూ, కౌలుగానూ మార్చడం ఎప్పుడు సాధ్యం కాదో, కార్మికశ్రమను గుత్తాధిపత్యం సాధించగల సామాజిక శక్తిగా[33] మార్చడం ఎప్పుడు సాధ్యంకాదో, అనగా వ్యక్తిగత ఆస్తిని బూర్జువా ఆస్తిగా, పెట్టుబడిగా మార్చడం ఎప్పుడు సాధ్యం కాదో, అప్పుడు ఆ క్షణం నుండే, వ్యక్తుల వ్యక్తిత్వం అదృశ్యమౌతుందని మీ వాదన.

కాబట్టి, మీ అవగాహనలో "వ్యక్తి" అంటే బూర్జువా తప్ప, మధ్యతరగతి[34] ఆస్తిపరుడు తప్ప మరెవ్వరూ కాదన్నమాట. ఈ విషయం మీరు ఒప్పుకోక తప్పదు. అయితే, ఆ వ్యక్తిని తప్పక ఊడ్చి పారవేయవలసిందే, నామరూపాలు లేకుండా చేయవలసిందే.

కమ్యూనిజం ఏ వ్యక్తికీ సమాజ ఉత్పత్తులను సొంతపరచుకునే హక్కు లేకుండా చేయదు. అలా సొంతపరచుకోవడం ద్వారా యితరుల శ్రమను దోచుకొనే హక్కును మాత్రమే అది తొలగిస్తుంది.

సొంత ఆస్తి రద్దయిన మీదట పనిచేయడం పూర్తిగా ఆగిపోతుందనీ, ప్రపంచమంతా సోమరితనం అలముకొంటుందనీ మరొక ఆక్షేపణ వుంది.

ఈ వాదం నిజమే అయితే, వట్టి సోమరితనంతో బూర్జువా సమాజం ఏనాడో భ్రష్టుపట్టిపోయి వుండేది; ఈ సమాజంలో పనిచేసేవాళ్ళు ఏమీ సంపాదించుకోలేక పోవడమూ, ఏదైనా సంపాదించుకునేవాళ్ళు పనిచేయకపోవడమూ మనం చూస్తున్నదే కదా. పెట్టుబడి రద్దయినప్పుడు వేతనశ్రమ అనేది కూడా రద్దౌతుంది అనే విషయాన్నే పదాడంబరంతో వల్లించడం తప్ప ఈ ఆక్షేపణలో పస ఏమీ లేదు[35].

భౌతిక ఉత్పత్తులను కమ్యూనిస్టు పద్ధతిలో ఉత్పత్తి చేసి, సొంతపరచుకొనే విధానం మీద ఏ అభ్యంతరాలను వ్యక్తం చేస్తున్నారో, మేధోపరమైన ఉత్పత్తులను కమ్యూనిస్టు పద్ధతిలో ఉత్పత్తి చేసి, సొంత పరచుకోవడం మీద కూడా అలాంటి అభ్యంతరాలనే చేస్తున్నారు. బూర్జువాదృష్టికి ఏవిధంగా వర్గ ఆస్తి అదృశ్యం కావడం, అసలు ఉత్పత్తే అదృశ్యం కావడంగా కనిపిస్తుందో, అదే విధంగా వారి దృష్టికి వర్గ సంస్కృతి అదృశ్యం కావడం, మొత్తం సంస్కృతి అంతా అదృశ్యం కావడంగా కనిపిస్తుంది.

ఏ సంస్కృతి పోతుందని బూర్జువా విలపిస్తున్నాడో, ఆ సంస్కృతి సమాజంలో అత్యంత అధిక సంఖ్యాకులకు యంత్రాలలాగా పనిచేసే శిక్షణ మాత్రమే ఇస్తుంది.

స్వేచ్ఛ, సంస్కృతి, న్యాయశాస్త్రం మొదలైన వాటిని గురించి మీకున్న మీ బూర్జువా అభిప్రాయాలనే ప్రమాణాలుగా చేసి, బూర్జువా ఆస్తిని రద్దు చేయాలనే మా ఉద్దేశాన్ని ఆ ప్రమాణాలతో కొలిచేటట్లయితే, మీరు మాతో కీచులాడకండి. అసలు మీ భావాలే మీ బూర్జువా ఉత్పత్తి వ్యవస్థ నుండీ, మీ బూర్జువా ఆస్తి వ్యవస్థ నుండీ ఉద్భవించినవి. అదే విధంగా మీ న్యాయశాస్త్రం కూడా మీ వర్గం యొక్క ఇచ్ఛయే. అదే సమస్త జనులూ అనుసరించవలసిన చట్టంగా రూపొందించబడి, న్యాయశాస్త్రమైంది. ఆ ఇచ్ఛ ప్రధాన స్వభావమూ, గమ్యమూ మీ వర్గం బతకడానికి అవసరమైన ఆర్థిక పరిస్థితుల చేత నిర్ణయించబడుతున్నాయి.

మీ ప్రస్తుత ఉత్పత్తి విధానమూ, మీ ప్రస్తుత ఆస్తి రూపమూ, ఉత్పత్తి పురోభివృద్ధిలో ఒకానొక దశలో ఉద్భవించి, అంతరించిపోయే చారిత్రక సంబంధాలు

మాత్రమే. వాటి నుండి ఉత్పన్నమైన సామాజిక రూపాలను ప్రకృతి సిద్ధమూ, హేతుబద్ధమూ అయిన శాశ్వత నియమాలుగా మార్చాలనుకోవడం మీ స్వార్థపూరిత దురవగాహన ఫలితమే. ఈ దురవగాహన చరిత్రలో మీరు రాకముందు కూడా ప్రతి పాలకవర్గానికీ వున్నదే. ప్రాచీన ఆస్తి[36] విషయంలో మీరు దేన్ని స్పష్టంగా అర్థం చేసుకోగలుగుతున్నారో, ఫ్యూడల్ ఆస్తి విషయంలో మీరు దేన్ని అంగీకరిస్తున్నారో, దాన్నే మీ సొంత బూర్జువా ఆస్తి విషయంలో మీరు ఒప్పుకోలేకపోతున్నారు.

కుటుంబం రద్దు ! కమ్యూనిస్టులు చేసే ఈ అపఖ్యాతికరమైన ప్రతిపాదన మీద అత్యంత అతివాదులు కూడా మండిపడుతున్నారు.

ఈనాటి కుటుంబం, అనగా బూర్జువా కుటుంబం ఏ పునాదుల మీద ఆధారపడి వుంది ? పెట్టుబడి మీద, వ్యక్తిగత లాభం మీద ఆధారపడి వుంది. ఈ కుటుంబం పరిపూర్ణ రూపంలో బూర్జువాలలో మాత్రమే వుంది. కానీ, కార్మికుల్లో కుటుంబం అనేది ఆచరణలో లేకపోవడమూ, బహిరంగంగా సాగే వేశ్యా వృత్తి అనే రెండు అంశాలూ ఈ స్థితికి అనుబంధంగా వున్నాయి.

బూర్జువా కుటుంబానికున్న యీ అనుబంధ అంశాలు అంతరించినప్పుడు బూర్జువా కుటుంబం దానంతట అదే అంతరిస్తుంది; పెట్టుబడి అంతరించినప్పుడు పై రెండూ అంతరిస్తాయి.

తల్లితండ్రులు తమ పిల్లల మీద సాగించే దోపిడీని మేము అంతం చేయాలనుకుంటున్నామని మీరు మమ్మల్ని నిందిస్తున్నారా ? ఈ విషయంలో మేము నేరస్తులమే.

కానీ, ఇంటి వద్ద చెప్పే విద్యకు బదులు సామాజిక విద్యను ప్రవేశ పెట్టడం ద్వారా, మేము అత్యంత పవిత్రమైన సంబంధాలను ధ్వంసం చేస్తున్నామని మీరు అంటారు.

మరి మీ విద్యో ? అది కూడా సామాజిక విద్య కాదా ? పాఠశాలలు మొదలైన వాటి ద్వారా సమాజం ప్రత్యక్షంగానో, పరోక్షంగానో విద్యలో జోక్యం కలిగించుకోవడం లేదా ? తద్వారా దాన్ని సామాజిక పరిస్థితులు నిర్ణయించడం

లేదా ? విద్యలో సమాజ జోక్యం అనేది కమ్యూనిస్టులు సృష్టించింది కాదు. అయితే కమ్యూనిస్టులు ఆ జోక్యం యొక్క స్వభావాన్ని మార్చాలంటారు. పాలకవర్గ ప్రభావంలో చిక్కుకొని వున్న విద్యను రక్షించాలంటారు.

కుటుంబం గురించీ, విద్య గురించీ, తల్లితండ్రులకూ పిల్లలకూ గల పవిత్ర అనుబంధాలను గురించీ మీరు చెప్పేవన్నీ వట్టి బూర్జువా ఆడంబరపు కబుర్లు. ఆధునిక పారిశ్రామిక వ్యవస్థ మూలంగా కార్మికుల కుటుంబ సంబంధాలన్నీ తునాతునకలయ్యేకొద్దీ, కార్మికుల బిడ్డలు వట్టి వ్యాపార వస్తువులుగానూ, శ్రమ చేసే సాధనాలుగానూ మారేకొద్దీ, మీ బూర్జువా కబుర్లు మరీ రోత పుట్టిస్తాయి.

కమ్యూనిస్టులు స్త్రీలను సమిష్టి ఆస్తిగా చేస్తారని బూర్జువాలందరూ ఒకే గొంతుకతో పొలికేకలు పెడుతున్నారు.

బూర్జువాకు తన భార్య కేవలం ఉత్పత్తి సాధనంగా మాత్రమే కనపడుతుంది. ఉత్పత్తి సాధనాలను సమిష్టిగా ఉపయోగించుకుంటారని వినగానే అతడు సహజంగానే స్త్రీలకు కూడా అదే గతి సంభవిస్తుందనే నిర్ణయానికి వస్తాడు. బూర్జువా బుద్ధికి అంతకు మించిన ఆలోచన ఎలా వస్తుంది !

స్త్రీలు కేవలం ఉత్పత్తి సాధనాలుగా వుండే యీ దుస్థితిని రద్దు చేయడమే మా అసలు లక్ష్యమని బూర్జువాకు కించిత్తు అనుమానమైనా రాదు.

కమ్యూనిస్టులు బహిరంగంగా అధికారికంగా స్త్రీలను సమిష్టి ఆస్తిగా చేస్తారని తామే కల్పించి, ఆ అభూత కల్పనమీద నీతివంతులులాగా ఆగ్రహం ప్రదర్శించే యీ బూర్జువాల ప్రవర్తన కంటే అపహాస్యకరమైనది మరొకటి వుండదు. కమ్యూనిస్టులు కొత్తగా స్త్రీలను సమిష్టి ఆస్తిగా చేయవలసిన అవసరమేమీ లేదు ః అది దాదాపు అనాది కాలం నుండి సమాజంలో వుంటూనే వుంది.

మన బూర్జువాలు, సాధారణ వేశ్యలమాట అటుంచి, తమ చేతికింద గల కార్మికుల భార్యలూ, కూతుర్లతో తమ కోర్కెలను తీర్చుకోవడం చాలక, ఒకరి భార్యల నొకరు అనుభవించడంలో అపారమైన ఆనందం పొందుతున్నారు.

బూర్జువా వివాహ వ్యవస్థే నిజానికి సమిష్టి భార్యల వ్యవస్థ. కాబట్టి కమ్యూనిస్టుల మీద బూర్జువాలు నింద వేయదలచుకుంటే, మహా అయితే,

బూర్జువాలు ప్రచ్ఛన్నంగా సాగించే కపట నాటకాన్ని కమ్యూనిస్టులు బహిరంగంగా చట్టబద్ధంగా చేస్తారని మాత్రమే నింద వేయగలరు. ఇక చెప్పవలసిందేమంటే, ప్రస్తుత ఉత్పత్తి వ్యవస్థ రద్దు కావడంతోనే ఇందులో నుండి ఉత్పన్నమైన సమిష్టి స్త్రీల వ్యవస్థ కూడా - అనగా బహిరంగ వేశ్యావృత్తీ, రహస్య వేశ్యావృత్తీ - రద్దు ఔతుందనేది స్పష్టంగా తెలుస్తూనే వుంది.

కమ్యూనిస్టులు దేశాలనూ, జాతీయతను రద్దు చేయగోరుతున్నారని మరొక నింద కూడా వుంది.

కార్మికులకు ఒక దేశం అనేది లేదు[37]. కాబట్టి వాళ్ళకు లేనిదాన్ని ఎవరూ లాక్కోలేరు. కార్మికవర్గం ప్రప్రథమంగా రాజకీయ ఆధిపత్యం సంపాయించుకోవాలి. తన జాతిలో తాను ప్రధానవర్గంగా అభివృద్ధి చెందాలి, జాతి అంటే తానే అనే స్థితికి రాకతప్పదు. కాబట్టి జాతి అనే మాటకు బూర్జువాలు చెప్పే అర్థంలో కానప్పటికీ, కార్మికవర్గమే ఆమేరకు జాతీయమైనది.

బూర్జువావర్గ అభివృద్ధి మూలంగానూ, స్వేచ్ఛా వాణిజ్యం మూలంగానూ, ప్రపంచ మార్కెట్ మూలంగానూ, ఉత్పత్తి విధానంలోనూ దాన్ని అనుసరించి వుండే జీవిత విధానంలోనూ వచ్చే ఏకరూపత మూలంగానూ, వివిధ జాతుల మధ్య వుండే జాతీయ విభేదాలూ, జాతీయ వైషమ్యాలు దినదినం ఎక్కువ వేగంగా అంతరించిపోతున్నాయి.

కార్మికవర్గ ఆధిపత్యంలో అవి యింకా వేగంగా అంతరించిపోతాయి. వివిధ దేశాలు, కనీసం ప్రముఖ నాగరిక దేశాలు సమైక్యంగా కృషిచేయడం కార్మికవర్గ విమోచనకు గల ఒక ముఖ్యమై షరతు.

ఒక వ్యక్తి మీద మరొక వ్యక్తి చేసే దోపిడీ ఏ మేరకు అంతమౌతుందో ఆ మేరకు, ఒక జాతి మీద మరొకజాతి చేసే దోపిడీ కూడా అంతమౌతుంది. ఒక జాతిలోని భిన్న వర్గాల మధ్య వైరుధ్యం ఏ మేరకు అంతరిస్తుందో ఆ మేరకు జాతికీ జాతికీ మధ్య వుండే శత్రుత్వం కూడా అంతరిస్తుంది.

ఇక మతదృష్ట్యానో, తత్వశాస్త్ర దృష్ట్యానో లేక ఏదో ఒక సిద్ధాంత దృష్ట్యానో కమ్యూనిజం మీద వేసే ఆరోపణలు అంత శ్రద్ధగా పరిశీలించదగినవి కావు.

మానవుని భౌతిక జీవిత పరిస్థితులలోనూ, సాంఘిక సంబంధాలలోనూ, సాంఘిక జీవితంలోనూ మార్పు వచ్చినప్పుడల్లా అతని భావాలూ, దృక్పథాలూ, భావనలూ, ఒక్కమాటలో చెప్పాలంటే, అతని చైతన్యం మారుతుందని గ్రహించడానికి అంత లోతైన అతీంద్రియ జ్ఞానం అవసరం లేదు కదా ?

భౌతిక వస్తూత్పత్తి ఏ మేరకు మారుతుందో ఆ మేరకు మేధోపరమైన ఉత్పత్తుల స్వభావంలో కూడా మార్పు వస్తుందని కాక, మానవ భావాల చరిత్ర మరేమి రుజువు చేస్తున్నది ? ప్రతి యుగంలోనూ ప్రజలను శాసించే భావాలు ఆనాటి పాలకవర్గపు భావాలే.

సమాజాన్ని విప్లవీకరించే భావాలను గురించి ఎవరైనా మాట్లాడినపుడు పాత సమాజం లోపలనే కొత్త సమాజపు బీజాలు సృష్టించబడ్డాయనీ, పాత జీవన విధానం ఏ మేరకు క్షీణిస్తే అదే మే.. కు పాత భావాలు కూడా క్షీణిస్తాయనే వాస్తవాన్ని మాత్రమే ఆ మాటలు వ్యక్తం చేస్తాయి.

ప్రాచీన ప్రపంచం చివరి ఘడియలలో వున్నపుడు ప్రాచీన మతాలను క్రైస్తవమతం అధిగమించింది. 18వ శతాబ్దిలో క్రైస్తవ భావాలు హేతువాద భావాలకు లొంగిపోయినప్పుడు ఫ్యూడల్ సమాజం ఆనాటి విప్లవకర బూర్జువావర్గంతో చావు బతుకుల పోరాటం చేసింది. మత స్వేచ్ఛ, అంతరాత్మ ప్రబోధాన్ని అనుసరించే స్వేచ్ఛ అనే భావాలు జ్ఞానరంగంలో స్వేచ్ఛాయుత పోటీ ఆధిక్యతను తెలియజేసే రూపాలు మాత్రమే.

"మత విశ్వాసాలూ, నైతికాభిప్రాయాలూ, తాత్వికాభిప్రాయాలూ, న్యాయశాస్త్ర భావాలూ చారిత్రక పురోగమనంలో నిస్సందేహంగా మార్పు చెందాయి. కానీ, మతం, నీతి, తత్వశాస్త్రం, రాజకీయ శాస్త్రం, న్యాయశాస్త్రం అనేవి ఆ మార్పులలో కూడా నిరంతరం సజీవంగానే కొనసాగాయి కదా" అని అనవచ్చు.

"అంతేకాక స్వేచ్ఛ, న్యాయం మొదలైన నిత్య సత్యాలు సమాజం యొక్క అన్ని దశల్లోనూ ఉమ్మడిగా వున్నాయి. కానీ, కమ్యూనిజం ఆ నిత్య సత్యాలనే రద్దు చేస్తుంది. మతాన్నీ, నీతినీ నూతన పునాదులపైన నిర్మించే బదులు సమస్త మతాన్నీ, సమస్త నీతినీ రద్దు చేస్తుంది. కాబట్టి కమ్యూనిజం గత చారిత్రక అనుభవానికంతటికీ వ్యతిరేకంగా పని చేస్తుంది" అని కూడా అనవచ్చు.

ఈ ఆరోపణ అర్థం ఏమిటి ? గత సమాజపు చరిత్ర అంతా వివిధ దశలలో వివిధ రూపాలు ధరించిన వర్గ వైరుధ్యాల అభివృద్ధి చరిత్రే.

కానీ, ఆ వైరుధ్యాలు ఏ రూపం ధరించినప్పటికీ, ఒక విషయం మాత్రం గతించిన యుగాలన్నిటికీ సామాన్య లక్షణంగా వుంది. సమాజంలో ఒక భాగాన్ని మరొక భాగం దోపిడీ చేయడమే ఆ సామాన్య లక్షణం. కాబట్టి గత యుగాల సామాజిక చైతన్యం ఎంత బహుళత్వమూ, ఎంత వైవిధ్యమూ ప్రదర్శించినప్పటికీ, అది కొన్ని సామాన్య రూపాలనే (common forms) లేదా కొన్ని సాధారణ భావాలనే (common ideas) ప్రదర్శిస్తూ వుంటుంది; సమస్త వర్గ వైరుధ్యాలూ సమూలంగా అంతరించినప్పుడు తప్ప యీ రూపాలు, లేక భావాలు సంపూర్ణంగా అంతరించిపోవు. ఇందులో ఆశ్చర్యపడవలసిందేమీ లేదు.

కమ్యూనిస్టు విప్లవం సంప్రదాయక ఆస్తి సంబంధాలతో సంపూర్తిగా తెగతెంపులు చేసుకొంటుంది. కనుక కమ్యూనిస్టు విప్లవం అభివృద్ధి సంప్రదాయక భావాలతో సంపూర్తిగా తెగతెంపులు చేసుకోవడంతో ముడిబడి వుంది. ఇందులో కూడా ఆశ్చర్యపడవలసిందేమీ లేదు.

కమ్యూనిజం మీద బూర్జువాలకు గల అభ్యంతరాల గురించి ఇంతటితో ముగిద్దాం.

కార్మికవర్గాన్ని పాలకవర్గ స్థానానికి పెంచటమూ, ప్రజాస్వామ్య యుద్ధంలో గెలుపొందటమూ కార్మికవర్గ విప్లవంలో మొదటి మెట్టని పైన తెలుసుకున్నాం.

కార్మికవర్గం తన రాజకీయ ఆధిపత్యాన్ని ఉపయోగించి బూర్జువా వర్గం నుండి సమస్త పెట్టుబడినీ క్రమక్రమంగా గుంజుకొంటుంది; ఉత్పత్తి సాధనాలన్నింటినీ రాజ్యం చేతుల్లో - అనగా పాలకవర్గంగా సంఘటితపడిన కార్మికవర్గం చేతుల్లో కేంద్రీకరిస్తుంది. ఆవిధంగానే మొత్తం ఉత్పత్తి శక్తులను సాధ్యమైనంత వేగంగా వృద్ధి చేస్తుంది.

సహజంగానే ప్రారంభంలో ఆస్తి హక్కుల మీదా, బూర్జువా ఉత్పత్తి విధానం మీదా నిరంకుశ చర్యలు చేస్తే తప్ప యిది సాధ్యం కాదు. కాబట్టి యీ చర్యలు ఆర్థికంగా అరకొరగానూ, అసమర్థనీయంగానూ కనపడతాయి. కానీ యీ చర్యలు

కాలక్రమాన యింకా మించిపోతాయి. పాత సామాజిక వ్యవస్థమీద యింకా చర్యలు తీసుకోవాల్సిన అవసరాన్ని కలిగిస్తాయి. మొత్తం ఉత్పత్తి విధానాన్ని పూర్తిగా విప్లవాత్మకంగా మార్చడానికి ఈ చర్యలు అనివార్యమౌతాయి.

ఈ చర్యలు భిన్న దేశాల్లో వేరువేరుగా వుండడం సహజమే.

అయినప్పటికీ, అత్యంత పురోగామి దేశాలకు ఈ క్రింది అంశాలు సాధారణంగా వర్తిస్తాయి.

1. భూముల మీద ఆస్తి హక్కు రద్దు చేయడం; భూముల మీద వచ్చే కౌలు డబ్బు అంతా సామాజిక కార్యాలకు వినియోగించడం.

2. భిన్న స్థాయిలను బట్టి ఆదాయపు పన్నును క్రమంగా భారీగా పెంచటం.

3. వారసత్వపు హక్కు సంపూర్ణంగా రద్దు.

4. దేశం వదిలివెళ్ళిపోయిన వారి ఆస్తీ, తిరుగుబాటుదార్ల ఆస్తినీ స్వాధీనం చేసుకోవడం.

5. ప్రభుత్వ పెట్టుబడితో జాతీయ బ్యాంకు ఏర్పరచి, పరపతి అంతా గుత్తాధికారంతో ప్రభుత్వం చేతిలో కేంద్రీకరించడం.

6. ప్రసార, రవాణా సాధనాలను ప్రభుత్వం చేతిలో కేంద్రీకరించడం.

7. ప్రభుత్వ ఫ్యాక్టరీలూ, ఉత్పత్తి సాధనాలను విస్తరింపజేయడం.

   బంజరు భూములను సాగు క్రిందకు తేవడం; ఒక సమష్టి పథకం ప్రకారం భూములను మెరుగుపరచడం.

8. శ్రమ చేసే బాధ్యత అందరికీ సమానంగా వుండడం, కార్మిక సైన్యాలను ముఖ్యంగా వ్యవసాయం కోసం ఏర్పరచడం.

9. వ్యవసాయాన్ని పరిశ్రమలతో అనుసంధానం చేయడం; దేశం మొత్తం మీద జనాభాను వివిధ ప్రాంతాలలో ఇంకా ఎక్కువ సమానంగా నివసించేటట్లు చేయడం ద్వారా పట్టణాలకూ, పల్లెలకూ గల భేదాన్ని క్రమక్రమంగా రద్దు చేయడం.

10. ప్రభుత్వ పాఠశాలల్లో పిల్లలందరికీ ఉచిత విద్య. ఇప్పుడున్న రూపంలో పిల్లలు ఫ్యాక్టరీలో పనిచేయడాన్ని రద్దుచేయడం. విద్యను పారిశ్రామిక ఉత్పత్తితో అనుసంధానం చేయడం వగైరా, వగైరా.

సమాజ అభివృద్ధి క్రమంలో వర్గవిభేదాలు అంతరించి, జాతి మొత్తం చాలా పెద్ద సమాఖ్యగా రూపొంది, దాని చేతిలో సమస్త ఉత్పత్తి కేంద్రీకృతమైనప్పుడు, ప్రభుత్వ అధికారం రాజకీయ స్వభావాన్ని కోల్పోతుంది. అసలు రాజకీయ అధికారమనేది, సరైన అర్థంలో, ఒక వర్గాన్ని పీడించడానికి మరొక వర్గం ఉపయోగించే సంఘటిత శక్తి మాత్రమే. కార్మికవర్గం, బూర్జువావర్గంతో తాను పోరాటం చేసే కాలంలో పరిస్థితుల ప్రాబల్యం వల్ల తానే ఒక వర్గంగా సంఘటితం కావలసి వస్తే, విప్లవం ద్వారా తానే పాలకవర్గం స్థానానికి వస్తే, అది పాత ఉత్పత్తి విధాన పరిస్థితులను బలవంతంగా వూడ్చి పారవేస్తుంది. అప్పుడు ఆ విధానంతోపాటు మొత్తం వర్గాలూ, వర్గ వైషమ్యాలూ మనగలగడానికి అవసరమైన పరిస్థితులను కూడా తుడిచివేస్తుంది. ఫలితంగా తన వర్గాధిపత్యాన్నే రద్దు చేసుకొంటుంది.

వర్గాలతోనూ, వర్గవైషమ్యాలతోనూ కూడి వున్న పాతబూర్జువా సమాజం స్థానే, యావన్మంది స్వేచ్ఛాభివృద్ధికీ, ప్రతి ఒక్కరి స్వేచ్ఛాభివృద్ధి తప్పనిసరయ్యే సమాజం ఏర్పడుతుంది.

3

# సోషలిస్టు, కమ్యూనిస్టు సాహిత్యం

## 1. అభివృద్ధి నిరోధక సోషలిజం

### అ. ఫ్యూడల్ సోషలిజం

ఫ్రాన్సు, ఇంగ్లండులలోని ఉన్నత ప్రభువర్గాలకు, ఆనాడు వారికున్న చారిత్రక స్థితిని బట్టి, ఆధునిక బూర్జువా సమాజానికి వ్యతిరేకంగా కరపత్రాలు రాయడం వృత్తి అయింది. 1830 జులై నాటి ఫ్రెంచి విప్లవంలోనూ[38], సంస్కరణల కొరకు ఇంగ్లండులో జరిగిన ఆందోళన ఉద్యమంలోనూ[39], ఆ ఉన్నత వర్గాలు నడమంత్రపు సిరితో హఠాత్తుగా పైకి వచ్చిన, తాము ద్వేషించే[40]వాళ్ళ చేతిలోనే మళ్ళీ ఓడిపోయాయి. ఆ నాటి నుండి నిజమైన రాజకీయ పోరాటానికి అసలు అవకాశమే లేకుండా పోయింది. ఇక సాధ్యమైందల్లా సాహిత్య రంగంలో యుద్ధం మాత్రమే. కానీ సాహిత్య రంగంలో కూడా పునరుద్ధరణకాలం[41] నాటి పాత పొలికేకలు అసంభవమైపోయాయి.

ఇతరుల సానుభూతి పొందే ఉద్దేశంతో, ఉన్నత ప్రభువర్గం తమ సొంత ప్రయోజనాలను విస్మరించినట్లు కనపడుతూ, పీడిత కార్మికవర్గ ప్రయోజనాల దృష్ట్యా మాత్రమే బూర్జువావర్గం మీద నేరారోపణ చేయవలసి వచ్చింది. ఆ విధంగా ఆ వర్గం తమ కొత్త యజమాని మీద ఎగతాళి పాటలు కట్టీ, మహోపద్రవం రానున్నదని యజమాని చెవిలో అశుభపు జోస్యాలు చెప్పీ, బూర్జువావర్గం మీద కసి తీర్చుకుంది.

ఈ విధంగా ఫ్యూడల్ సోషలిజం ఉత్పన్నమైంది. ఇది సగం ఏడుపూ, సగం వెక్కిరింతలతో; సగం గత కాలపు ప్రతిధ్వనీ, సగం భవిష్యత్ కాలపు బెదిరింపులతో; నిశిత, వ్యంగ్య, తీవ్రమైన విమర్శలతో కొన్నిసార్లు బూర్జువాల గుండెలు చీల్చింది; కానీ, ఆధునిక చరిత్ర గతిని అర్థం చేసుకొనే శక్తి బొత్తిగా లేకపోవడంవల్ల ఎల్లప్పుడూ వారి విమర్శ హాస్యాస్పదంగానే వుండిపోయింది.

ప్రజలను తమ చుట్టూ సమీకరించుకోవడానికి ఆ ఉన్నత ప్రభువులు కార్మిక వర్గపు బిచ్చపుజోలెను తమ పతాకగా ఎగరవేశారు[42]. కానీ, ప్రజలు వాళ్ళతో

కలిసినప్పుడల్లా, వారి వీపుల మీద వున్న పాత ఫ్యూడల్ వంశచిహ్నాలను చూసి వెటకారంగా విరగబడి నవ్వుతూ వాళ్ళను వదలివేసి వెళ్ళేవాళ్ళు.

ఫ్రెంచి లెజిటిమిస్టులలో[43] ఒక భాగమూ, "యంగ్ ఇంగ్లండ్" అనే సంస్థా[44] ఇలాంటి దృశ్యాన్ని ప్రదర్శించాయి.

ఈ ఫ్యూడల్ వాదులు తమ దోపిడీ విధానం బూర్జువా దోపిడీ విధానం కంటే భిన్నమైందని గుర్తు చేస్తారు. కానీ, తాము దోపిడీ చేసిన నాటి పరిస్థితులు చాలా భిన్నంగా వుండేవనీ, అవి పాతబడి పనికిరాకుండా పోయాయనీ మరచిపోతారు. తాము పాలించే రోజుల్లో ఆధునిక కార్మికవర్గం లేనేలేదని వాదిస్తారు. కానీ, తమ సమాజ వ్యవస్థ నుండే ఆధునిక బూర్జువావర్గం అనివార్యంగా జన్మించిందని వీళ్ళు మరచిపోతారు.

వీరు తమ విమర్శలలోని ప్రగతి వ్యతిరేక స్వభావాన్ని చాలా కొద్దిగా మాత్రమే దాచుకోగలిగారు. పాత సమాజ వ్యవస్థనంతటినీ సమూలంగా అంతం చేసే లక్ష్యం గల ఒక వర్గం బూర్జువా పరిపాలనలో పెంపొందుతున్నదని వారు విమర్శిస్తారు. బూర్జువావర్గం మీద వారు చేసే ప్రధాన అభియోగం సారాంశమిదే.

వీళ్ళు బూర్జువా వర్గాన్ని నిందించేది ప్రధానంగా కార్మికవర్గాన్ని సృష్టించినందుకు కాదు, విప్లవ కార్మికవర్గాన్ని సృష్టించినందుకు.

అందుచేత రాజకీయ ఆచరణలో వీళ్ళు కార్మికవర్గానికి వ్యతిరేకమైన అణచివేత చర్యలనన్నిటినీ బలపరుస్తారు. నిత్య జీవితంలో పైకి ఎంత బడాయిగా మాట్లాడినా, వీళ్ళు పరిశ్రమల చెట్టు నుండి రాలిన బంగారు పండ్లను ఏరుకోవడానికి దిగజారుతూ వుంటారు; ఉన్ని, చక్కెర, సారాయి లాంటి వ్యాపారాలలో లాభాలు పొందడానికి సత్యం, ప్రేమ, ఆత్మగౌరవాలను మారకం చేసుకుంటారు.[45]

భూస్వామితో మత గురువు ఎల్లప్పుడూ చెట్టపట్టాలు వేసుకొని తిరిగినట్లే, ఫ్యూడల్ సోషలిజంతో క్రైస్తవ సోషలిజం ఎల్లప్పుడూ కలిసే వుంటుంది.

క్రైస్తవ వైరాగ్యానికి సోషలిస్టు రంగు పూయడం చాలా తేలిక. క్రైస్తవ మతం సొంత ఆస్తిని ఖండించలేదా ? వివాహాన్ని ఖండించలేదా ? రాజ్యాన్ని ఖండించలేదా? వీటికి బదులు దాతృత్వం, పేదరికం, బ్రహ్మచర్యం, శారీరక వాంఛలను అదుపులో

వుంచుకోవటం, సన్యాసి జీవనం, చర్చిసేవలను బోధించలేదా? ఉన్నత ప్రభువుల మనస్సులలోని ఈర్ష్యాసూయలను తొలగించి, వారిని పవిత్రపరచడానికి మతగురువు వాడే మంత్రజలమే క్రైస్తవ సోషలిజం.

## ఆ. పెటీ బూర్జువా సోషలిజం

బూర్జువావర్గం వల్ల నాశనమైంది ఒక్క ఫ్యూడల్ ప్రభువర్గమే కాదు; ఆధునిక బూర్జువా సమాజపు వాతావరణంలో కృశించి నశించింది ఒక్క ఫ్యూడల్ ప్రభువుల జీవిత విధానమే కాదు. మధ్యయుగాల పట్టణ స్వతంత్ర పౌరులూ, సొంతపొలంగల చిన్న రైతులూ ఆధునిక బూర్జువా వర్గానికి పూర్వీకులు. పరిశ్రమలూ, వాణిజ్యమూ యింకా సరిగా అభివృద్ధి కాని దేశాలలో యీ రెండు వర్గాలూ వర్ధమాన బూర్జువావర్గం పక్కనే మార్పు లేని జీవితాన్ని గడుపుతూ వుంటాయి.

ఆధునిక నాగరికత పూర్తిగా అభివృద్ధి చెందిన దేశాలలో పెటీ బూర్జువా వర్గం అనే ఒక కొత్తవర్గం ఏర్పడింది. ఇది కార్మికవర్గానికీ బూర్జువా వర్గానికీ మధ్య అటూ ఇటూ ఊగిసలాడుతూ వుంటుంది. బూర్జువా సమాజపు అనుబంధంగా నిత్యం పునస్సృష్టి అవుతూ వుంటుంది. కానీ యీ వర్గంలోని వ్యక్తులు, వ్యాపార పోటీ మూలంగా, కార్మికవర్గంలోకి నిత్యం దిగదోయబడుతూ వుంటారు. ఆధునిక పరిశ్రమలు అభివృద్ధి అయ్యేకొద్దీ ఆధునిక సమాజంలో ఒక స్వతంత్ర విభాగంగా తాము పూర్తిగా అంతరించిపోయే సమయం సమీపిస్తున్నదనీ, కర్మాగారాలలోనూ, వ్యవసాయంలోనూ, వర్తకంలోనూ తమ స్థానంలో మేస్త్రీలూ, మేనేజర్లూ, గుమాస్తాలూ వస్తారని కూడా వారు గ్రహిస్తారు.

జనాభాలో సగం కంటే చాలా ఎక్కువమంది రైతులు వున్న ఫ్రాన్సు వంటి దేశాల్లో, బూర్జువా వర్గానికి వ్యతిరేకంగా కార్మికవర్గ పక్షం వహించిన రచయితలు తాము బూర్జువా వ్యవస్థ మీద చేసే విమర్శలలో రైతునూ, పెటీ బూర్జువానూ ప్రమాణంగా తీసుకొని, యీ మధ్యంతర వర్గాల దృక్పథంతో కార్మికవర్గం తరపున పోరాటానికి పూనుకోవడం సహజమే. ఈ విధంగా పెటీ బూర్జువా సోషలిజం ఉద్భవించింది. ఈ సిద్ధాంతానికి ఫ్రాన్సులోనే కాక, ఇంగ్లండులో కూడా సిస్మాండీ నాయకుడు.

ఈ పెటీ బూర్జువా సోషలిజం ఆధునిక ఉత్పత్తి విధాన పరిస్థితులలోని వైరుధ్యాలను ఎంతో నిశితంగా విమర్శించింది. అర్థశాస్త్రవేత్తల మోసపు సమర్థనలను అది బట్టబయలు చేసింది. యంత్రాలవల్లా, శ్రమవిభజనవల్లా ఘోరమైన దుష్ఫలితాలు కలుగుతాయనీ, పెట్టుబడీ, భూమీ కొద్ది మంది చేతుల్లో కేంద్రీకృతమౌతాయనీ; అధికోత్పత్తీ, ఆర్థిక సంక్షోభాలూ కలుగుతాయనీ అది తిరుగులేని విధంగా రుజువు చేసింది. పెటీ బూర్జువాలూ, రైతులూ అనివార్యంగా పొందే సర్వనాశనాన్నీ, కార్మికవర్గ దైన్యస్థితినీ, ఉత్పత్తిలో అరాచకత్వాన్నీ, దేశ సంపద పంపిణీలోని దారుణమైన అసమానతలనూ, దేశాల మధ్య జరిగే మారణాంతకమైన పారిశ్రామిక యుద్ధాలనూ వివరించింది. పాత నైతిక బంధాలకూ, కుటుంబ సంబంధాలకూ, జాతులకూ కలిగే విచ్ఛిత్తినీ అది వెల్లడి చేసింది.

అయితే, యీ పెటీబూర్జువా సోషలిజానికి గల సానుకూల లక్ష్యాలు ఏమిటి? పాత ఉత్పత్తి సాధనాలనూ, మారకపు సాధనాలనూ పునఃస్థాపించి, వాటితోపాటు పాత ఆస్తి సంబంధాలనూ, పాత సమాజాన్నీ పునఃస్థాపించాలని ఈ సోషలిజం ఆశిస్తుంది; లేదా ఆధునిక ఉత్పత్తి సాధనాలచేతా, ఆధునిక మారకపు సాధనాలచేతా బద్దలైన లేదా బద్దలు కాక తప్పని, పాత ఆస్తి సంబంధాల చట్రంలోనే యీ సాధనాలను బలవంతంగా యిరికించాలని ఆశిస్తుంది. ఈ రెండు పథకాలు కూడా ప్రగతి నిరోధకాలే, ఊహాజనితమైనవే.

పరిశ్రమల్లో బడా వృత్తి సంఘాలూ, వ్యవసాయంలో పితృస్వామిక సంబంధాలు – ఇవీ ఈ సోషలిజం వల్లించే తుది పలుకులు.

చివరకు, కఠినమైన చారిత్రక వాస్తవాల వల్ల, ఆత్మవంచనచే కలిగిన మత్తు పూర్తిగా వదలినప్పుడు, యీ సోషలిజం బిక్కముఖం వేసుకుని కూర్చుంది.

### ఇ. జర్మన్ సోషలిజం, లేక "నిజమైన" సోషలిజం

ఫ్రాన్సులో బూర్జువావర్గం అధికారంలో వున్నప్పుడు, ఆ బూర్జువావర్గం సృష్టించిన వత్తిడి కారణంగా, ఆ ప్రభుత్వం మీద జరిగే పోరాటాన్ని వ్యక్తీకరిస్తూ, ఫ్రెంచి సోషలిస్టు, కమ్యూనిస్టు సాహిత్యం ఉద్భవించింది. కానీ, జర్మనీలో బూర్జువా వర్గం ఫ్యూడల్ నిరంకుశత్వంతో అప్పుడప్పుడే పోరాటం ప్రారంభించిన సమయంలో, ఈ సాహిత్యం ఫ్రాన్సు నుండి జర్మనీలోకి ప్రవేశపెట్టబడింది.

జర్మన్ తత్వవేత్తలూ, తత్వవేత్తలు కాబోయేవాళ్ళూ, యువమేధావులూ యీ సాహిత్యం మీదికి ఆత్రంగా ఎగబడ్డారు. కానీ యీ రచనలు ఫ్రాన్సు నుండి జర్మనీలోకి దిగుమతి అయినప్పుడు వాటితో పాటు ఫ్రాన్సులోని సామాజిక పరిస్థితులు దిగుమతి కాలేదనే విషయాన్ని మాత్రం వాళ్ళు విస్మరించారు. జర్మన్ సామాజిక పరిస్థితుల సంపర్కంతో యీ సాహిత్యం తక్షణ ఆచరణాత్మక ప్రాముఖ్యతను కోల్పోయి, కేవలం సాహిత్య విషయంగా నిలిచింది. ఈ విధంగా 18వ శతాబ్దపు జర్మన్ తత్వవేత్తల దృష్టిలో ప్రథమ ఫ్రెంచి విప్లవ డిమాండ్లు ఆచరణాత్మక హేతువు[46] యొక్క సాధారణ డిమాండ్లు మాత్రమే; విప్లవ ఫ్రెంచి బూర్జువావర్గపు ఇచ్ఛలో వాళ్ళకు దర్శనమిచ్చింది ఇచ్ఛాదేవత[47] యొక్క అకళంక అవశ్య స్వరూపం. అది సమస్త మానవాళినీ పాలించే ఇచ్ఛాదేవత యొక్క అసలైన స్వరూపం.

జర్మన్ సాహితీవేత్తలు చేసిన కృషి అంతా ఏమిటంటే, తమ పురాతన తాత్విక అంతరాత్మకు ఆమోదయోగ్యంగా వుండేటట్లు యీ నూతన ఫ్రెంచి భావాలను రూపుదిద్దారు. లేదా, ఇంచుమించుగా సరిగా చెప్పాలంటే, తమ సొంత తాత్త్విక దృష్టిని వదలుకోకుండా ఫ్రెంచి భావాలను జీర్ణించుకున్నారు.

ఒక విదేశీ భాషను అనువాదం ద్వారా ఏ విధంగా జీర్ణించుకుంటామో, ఆ విధంగానే దీనిని కూడా సంగ్రహించారు[48].

క్రైస్తవేతరులైన ఆదిమ జాతుల లిఖిత పురాణాలలోకి క్రైస్తవ దివ్యపురుషుల అతి సాధారణ జీవితకథలను క్రైస్తవ సన్యాసులు ఏవిధంగా చొప్పించిందీ అందరికీ తెలుసు[49]. జర్మన్ సాహితీవేత్తలు లౌకిక ఫ్రెంచి సాహిత్యం విషయంలో యిదే పద్ధతిని తలక్రిందులుగా అనుసరించారు. వీళ్ళు తమ తాత్విక చెత్తను ఫ్రెంచి రచయితల మూలపాఠాలలోకి చొప్పించారు. ఉదాహరణకు, డబ్బు యొక్క ఆర్థిక విధుల గురించిన ఫ్రెంచి విమర్శ కింద వాళ్ళు "మానవజాతి పరాయీకరణ"[50] అని రాశారు. బూర్జువా రాజ్యం గురించిన ఫ్రెంచి విమర్శ స్థానంలో "సాధారణత్వం పదవీభ్రష్టత పొందింది[51] అని రాశారు. ఇంకా అనేక విషయాలను ఇదే పద్ధతిలోనే రాశారు.

ఫ్రెంచి చారిత్రక విమర్శల వెనుక యీ తాత్త్విక పదాలు ప్రవేశపెట్టడాన్ని వాళ్ళు "క్రియాత్మక తత్త్వశాస్త్రం" అనీ, "నిజమైన సోషలిజం" అనీ, "జర్మన్ సోషలిస్టు

విజ్ఞానశాస్త్రం" అనీ, "సోషలిజం యొక్క తాత్త్విక పునాది" అనీ అనేక విధాలుగా నామకరణం చేశారు.

ఈ విధంగా ఫ్రెంచి సోషలిస్టు, కమ్యూనిస్టు సాహిత్యం సంపూర్ణంగా నిర్వీర్యపరచబడింది. జర్మన్ల చేతుల్లో అది ఒక వర్గం మీద మరొక వర్గం చేసే పోరాటాన్ని వ్యక్తం చేయడం మానుకుంది గనుక, వాళ్ళు "ఫ్రెంచి పాక్షికత" ను అధిగమించినట్లూ, వాస్తవంగా కావలసిన అవసరాలనుగాక, పరమ సత్యానికి కావలసిన అవసరాలను వెలిబుచ్చినట్లూ భావించారు; వాళ్ళు వెలిబుచ్చిన భావాలు కార్మికవర్గ ప్రయోజనాలు కావు; మానవ ప్రకృతిని ఏ వర్గానికీ చెందని, వాస్తవికత లేని, తాత్త్విక భ్రమల కల్పిత లోకంలో తప్ప ఎక్కడా వుండని "మానవ స్వభావాన్ని" సాధారణ "మానవ" ప్రయోజనాలుగా వారు భావించారు.

బడిపిల్లల రచనలాంటి తన రచనపట్ల అంత శ్రద్ధాసక్తులు కనబరిచిన యీ జర్మన్ సోషలిజం, తన నాసిరకపు సరుకును అంత సిగ్గు విడిచి తెగపొగుడుకున్న యీ జర్మన్ సోషలిజం, యీలోగా తన ఛాందస అమాయకత్వంతో కూడిన పాండిత్య ప్రకర్షణను క్రమక్రమంగా కోల్పోయింది[52].

ఫ్యూడల్ ప్రభువర్గంతోనూ, నిరంకుశ రాజరికంతోనూ జర్మన్ బూర్జువా వర్గం, ముఖ్యంగా ప్రష్యన్ బూర్జువా వర్గం చేసిన పోరాటం, అనగా ఉదారవాద ఉద్యమం[53], మరింత నిజాయితీ గలదిగా బలపడింది.

దీనితో ఎన్నాళ్ళ నుండో ఎదురు చూస్తూ వున్న అవకాశం దానికి లభించింది. "నిజమైన" సోషలిజం, వెంటనే రాజకీయ ఉద్యమాన్ని తన సోషలిస్టు డిమాండ్లతో ఎదుర్కొంది; ఉదారవాదం మీదా, ప్రజాప్రాతినిధ్యపు ప్రభుత్వం మీదా, బూర్జువా పోటీతత్త్వం మీదా, బూర్జువా పత్రికా స్వాతంత్ర్యం మీదా, బూర్జువా శాసన నిర్మాణం మీదా, బూర్జువా స్వేచ్ఛా సమానత్వాల మీద సాంప్రదాయక శాపనార్థాలను కురిపించింది; బూర్జువా ఉద్యమం ద్వారా సామాన్య ప్రజలకు ఒరిగే లాభమేమీ లేదనీ, అంతా నష్టమే కలుగుతుందనీ వారికి ఉద్బోధించింది. కానీ, ఫ్రెంచి విమర్శకు తెలివితక్కువ ప్రతిధ్వని అయిన యీ జర్మన్ సోషలిజం సరిగ్గా ఆ సమయానికి ఒక విషయాన్ని మరిచిపోయింది. ఫ్రెంచి విమర్శ పుట్టిన నాటికి అక్కడ ఆధునిక బూర్జువా సమాజం అనేది వుంది. అది మనగల్గటానికి

అనుగుణ్యమైన ఆర్థిక విధానమూ వుంది. రాజకీయంగా తదనుగుణమైన రాజ్యాంగమూ వుంది; సరిగ్గా వీటిని సాధించడమే జర్మనీలో సాగుతున్న పోరాట లక్ష్యం.

నిరంకుశ ప్రభుత్వాలూ, వాటి పరివారంలోని మతగురువులూ, ప్రొఫెసర్లూ, గ్రామీణ ప్రభువులూ, రాజోద్యోగులకూ తమకు ప్రమాదంగా పరిణమిస్తున్న బూర్జువా వర్గాన్ని బెదరగొట్టడానికి ఈ జర్మన్ సోషలిజం ఆహ్వానించతగిన దిష్టిబొమ్మగా ఉపయోగపడింది.

సరిగ్గా ఆ కాలంలోనే ఆ నిరంకుశ ప్రభుత్వాలు జర్మన్ కార్మికవర్గపు తిరుగుబాట్లను కొరడా దెబ్బలూ, తుపాకీ కాల్పులూ అనే చేదు మాత్రలతో ముంచివేశాయి. ఆ సమయంలోనే ప్రభుత్వాలు ఈ జర్మన్ సోషలిజాన్ని దిష్టిబొమ్మగా వాడుకోవడం చేదు మాత్రల తర్వాత నోటికి తీపి అందించినట్లుగా వుంది.

ఈ విధంగా యీ "నిజమైన" సోషలిజం ఒకవైపున జర్మన్ బూర్జువా వర్గాన్ని దెబ్బతీయడానికి ఫ్యూడల్ ప్రభుత్వాల చేతిలో ఆయుధంగా ఉపయోగపడుతూ, మరొకవైపున ఒక ప్రగతి వ్యతిరేక సంస్కార హీనులైన, జర్మన్ అల్పబుద్ధుల[54] ప్రయోజనానికి, ప్రత్యక్షంగా ప్రాతినిధ్యం వహించింది. జర్మనీలో నేటి పరిస్థితిలో పెటీ బూర్జువావర్గమే నిజమైన సాంఘిక పునాది. అది 16వ శతాబ్దపు అవశేషం. ఆనాటి నుండి ఆ వర్గం నిరంతరం వివిధ రూపాల్లో తల ఎత్తుతూ వున్నది.

ఈ వర్గాన్ని అలాగే భద్రంగా నిలుపుకోవడమంటే జర్మనీలో ప్రస్తుత పరిస్థితులనే నిలుపుకోవడమన్నమాట. బూర్జువావర్గపు పారిశ్రామిక రాజకీయ ఆధిపత్యం వస్తే యీ పెటీ బూర్జువావర్గం నిస్సంశయంగా నాశనమౌతుంది. ఒక వైపు పెట్టుబడి కేంద్రీకరణ మూలంగానూ, మరోవైపు విప్లవ కార్మికవర్గం అభివృద్ధి ద్వారానూ ఆ వర్గం నాశనం అవుతుంది. "అసలు" సోషలిజం యీ రెండు పిట్టలనూ ఒకే దెబ్బతో చంపేటట్లు కనపడింది. కాబట్టి అది మహమ్మారిలాగా వ్యాపించింది.

ఊహాగానాల సాలెగూళ్ళ చీనాంబరాల మీద కావ్య భాషాలంకారాల జరీబుటాలు కుట్టి, అనారోగ్యకర వెక్కసపు మమతానురాగాల తొలిమంచు తుంపరలో ముంచిన ఈ దివ్యాంబరాలతో జర్మన్ సోషలిస్టులు ఎముకల గూడులాంటి తమ

వికృతాకారపు "నిత్యసత్యా"లను అలంకరించారు[55]. ఈ అలంకరణతో వాళ్ళ సరుకు అమ్మకాలు ఆ ప్రజలలో అద్భుతంగా పెరిగిపోయాయి.

పెటీ బూర్జువా అల్పబుద్ధుల ఆర్భాటపు ప్రతినిధిగా పనిచేయడమే తన వృత్తి అని జర్మన్ సోషలిజం అంతకంతకూ గుర్తించింది.

జర్మన్‌జాతే ఆదర్శజాతి అనీ, సంస్కార హీనులైన జర్మన్ అల్పబుద్ధులే కల్తీలేని మానవులనీ అది ఉద్ఘాటించింది. ఈ ఆదర్శ మానవుల నీచపు క్రూర కర్మలకన్నిటికీ గూఢార్థాలు లాగి, వాటి నిజ స్వభావానికి కేవలం విరుద్ధమైన విధంగా ఉదాత్త సోషలిస్టు వ్యాఖ్యానాలు కల్పించింది. అది కమ్యూనిజంలో "అమానుష విధ్వంసక" ధోరణి వున్నదంటూ, దాన్ని సూటిగా వ్యతిరేకించేటంత వరకూ పోయింది; సకల వర్గపోరాటాల మీద పక్షపాతం లేకుండా ఏహ్యభావం వెలిగక్కేటంత వరకూ పోయింది. ఈనాడు (1847) సోషలిస్టు కమ్యూనిస్టు గ్రంథాలుగా జర్మనీలో ప్రచారంలో వున్నవన్నీ, ఏ ఒకటో రెండో తప్ప, మనుషులను నిర్వీర్యపరిచే ఈ దుర్గంధభూయిష్టమైన జర్మన్ సాహిత్యానికి సంబంధించినవే[56]. చాలా కొద్ది ప్రచురణలు మాత్రమే దీనికి మినహాయింపు.

## 2. సంప్రదాయ సోషలిజం, లేక బూర్జువా సోషలిజం

బూర్జువా సమాజాన్ని చిరస్థాయి చేసే ఉద్దేశంతో, సామాజిక ఇబ్బందులు తొలగించాలని బూర్జువావర్గంలో ఒక భాగం కోరుతుంది.

అర్థశాస్త్రవేత్తలూ, పరోపకార పరాయణులూ, మానవతావాదులూ, కార్మికవర్గ పరిస్థితిని మెరుగుపరచాలనేవారూ, ధర్మసంస్థల నిర్వాహకులు, జంతుహింసా నివారణ సంఘాల సభ్యులూ, మద్యపానానికి వ్యతిరేకంగా ప్రచారం చేసే పిచ్చివాళ్ళూ మొదలైన అనంత రూపాల కుహనా సంస్కర్తలూ ఈ వర్గంలో వున్నారు. అంతేగాక, ఈ రకం సోషలిజం కొన్ని సమగ్ర సిద్ధాంతాలుగా కూడా తయారు చేయబడింది.

ఈ రకానికి ఉదాహరణగా ప్రౌధన్[57] రాసిన 'దారిద్ర్యం యొక్క తత్వశాస్త్రం' ను చెప్పవచ్చు.

సోషలిస్టు బూర్జువాలు ఆధునిక సాంఘిక పరిస్థితులు ఇచ్చే సౌకర్యాలన్నీ కావాలంటారు. కానీ వాటి వెంట తప్పనిసరిగా వచ్చే పోరాటాలూ, ప్రమాదాలు

మాత్రం లేకుండా, ప్రస్తుత సమాజం ఇచ్చే సౌకర్యాలన్నీ కావాలంటూ ప్రస్తుత సమాజంలో గల విప్లవకర విచ్ఛేదకాంశాలూ లేకుండా ఈ సమాజం ఇలాగే వుండాలని వీళ్ళు కోరుకుంటారు. కార్మికవర్గం లేకుండా బూర్జువావర్గం మాత్రమే వుండాలని వారి కోరిక. బూర్జువావర్గం తన సర్వాధిపత్యం సాగే సమాజమే అత్యుత్తమమైనదని సహజంగా వూహిస్తుంది. ఈ సౌకర్యవంతమైన ఊహనే బూర్జువా సోషలిజం వివిధ సిద్ధాంతాలుగా, ఇంచుమించు సమగ్ర రూపంలో తయారుచేస్తుంది. ఇటువంటి ఒక సిద్ధాంతాన్ని కార్మికవర్గం అమలు జరిపి, వెంటనే ఆ స్వర్గ సమాజంలోకి నేరుగా ప్రవేశించాలని కోరుతుంది. కానీ ఈ సోషలిజం వాస్తవంగా కార్మికవర్గం ప్రస్తుత సమాజపు హద్దులలోనే వుండాలనీ, బూర్జువావర్గం గురించి తనకున్న ద్వేషపూరిత భావాలనన్నిటినీ విసర్జించాలనీ అది కోరుకుంటుంది.

ఈ బూర్జువా సోషలిజంలోనే, ఇంతకంటే ఎక్కువ ఆచరణ దృష్టి కల మరొక రూపం ఉంది. కానీ అది యింత క్రమబద్ధమైనది కాదు. ఇది కార్మికులకు కేవలం రాజకీయ సంస్కరణ వల్ల ఒరిగేదేమీ లేదనీ, భౌతిక జీవన పరిస్థితులలో మార్పు, అనగా ఆర్థిక పరిస్థితులలో మార్పు వలన మాత్రమే వాళ్ళకేమైనా ప్రయోజనకరంగా వుండగలదనీ చూపిస్తుంది. తద్వారా ప్రతి విప్లవోద్యమాన్నీ పనికిమాలినదిగా కార్మికుల ముందు చిత్రించడానికి పూనుకుంది. కానీ యీ రకం సోషలిజం చెప్పే భౌతిక జీవన పరిస్థితుల మార్పుకు అర్థం బూర్జువా ఉత్పత్తి సంబంధాల రద్దు కాదు, ఏ సంబంధాల రద్దు విప్లవం ద్వారా మాత్రమే సాధ్యమౌతుందో అది కాదు. దాని అర్థం ఉత్పత్తి సంబంధాలు చెక్కు చెదరకుండా వుంటూ, వీటి మీదనే ఆధారపడిన పరిపాలనా సంస్కరణలు; అనగా పెట్టుబడికీ, శ్రమకూ మధ్య గల సంబంధాలను ఏ మాత్రమూ ప్రభావితం చేయని సంస్కరణలు అవి. మహా అయితే, అవి బూర్జువా ప్రభుత్వ పరిపాలనకయ్యే ఖర్చు తగ్గించి, పరిపాలనాపరమైన పనిని సులభతరం చేసే సంస్కరణలు.

"బూర్జువా సోషలిజం" అనే మాటలు కేవలం అలంకారప్రాయంగా ఉపయోగించినప్పుడు, అప్పుడు మాత్రమే ఆ మాటలకు తగినంత అర్థం ఏర్పడుతుంది.

స్వేచ్ఛా వ్యాపారం ఎందుకంటే కార్మికవర్గ శ్రేయస్సు కొరకట ! రక్షణ సుంకాలు[58] ఎందుకంటే కార్మికవర్గ శ్రేయస్సు కొరకు ! జైళ్ళ సంస్కరణ ఎందుకంటే కార్మికవర్గ శ్రేయస్సు కొరకు ! ఇది బూర్జువా సోషలిజం చెప్పే చివరి మాట; ఇదొక్కటే బూర్జువా సోషలిజం మనస్ఫూర్తిగా చెప్పిన మాట కూడా.

బూర్జువా సోషలిజాన్ని ఒక్కమాటలో క్రోడీకరించవచ్చు : బూర్జువా బూర్జువాగా వుండడం ఎందుకంటే కార్మికవర్గ శ్రేయస్సు కొరకు !

## 3. విమర్శనాత్మక ఊహాజనిత సోషలిజమూ, కమ్యూనిజమూ

ప్రతి గొప్ప ఆధునిక విప్లవంలోనూ బాబెఫ్[59] మొదలైన వారి రచనలు ఎల్లప్పుడూ కార్మికవర్గ డిమాండ్లను వ్యక్తీకరించాయి. మనం ఇక్కడ ప్రస్తావిస్తున్నది అలాంటి సాహిత్యం గురించి కాదు.

ఫ్యూడల్ సమాజం కూలదోయబడుతూ వున్న కాలంలోని ఆ సార్వత్రిక ఉద్రిక్త పరిస్థితులలో, కార్మికవర్గం తన సొంత లక్ష్యాలు సాధించుకోవడానికి ప్రప్రథమంగా ప్రత్యక్ష ప్రయత్నాలు చేసింది. కానీ, ఆనాటికి కార్మికవర్గం ఇంకా వెనుకబడిన స్థితిలో వుంది. దాని విమోచనకు అవసరమైన ఆర్థిక పరిస్థితులు ఇంకా రూపొందవలసి వుంది. ఆ పరిస్థితులు ఆసన్నమవుతూ వున్న బూర్జువా యుగంవల్ల మాత్రమే ఉత్పన్నం కాగలవు. అలాంటి పరిస్థితులు ఆనాడు లేనందువల్ల, కార్మికవర్గపు ప్రథమ ప్రత్యక్ష ప్రయత్నాలు విఫలం కాక తప్పలేదు. ఈ ప్రథమ కార్మిక ఉద్యమాలలో పుట్టిన విప్లవ సాహిత్యానికి ప్రగతి నిరోధక స్వభావం విధిగా వుంది. ఆ సాహిత్యం అందరికీ కోరికలు త్యజించిన సన్యాసత్వాన్ని, అత్యంత మొరటు రూపంలో సాంఘిక సమానతనూ బోధించింది.

సోషలిస్టు సిద్ధాంతాలూ, సమగ్ర కమ్యూనిస్టు సిద్ధాంతాలు అని సరిగా అనదగినట్టి సెయింట్ సైమన్[60], ఫోరియర్[61], ఓవెన్[62], మొదలైన వారి సిద్ధాంతాలు కార్మికవర్గానికీ, బూర్జువా వర్గానికి మధ్య జరిగే పోరాటం అభివృద్ధికాని తొలి దశలో ఉద్భవించాయి. (ఈ దశను గురించిన వర్ణన "బూర్జువాలూ, కార్మికులూ అన్న మొదటి ప్రకరణంలో వుంది)[63].

ఈ సిద్ధాంతాలను రూపొందించినవారు ఆనాటి సమాజంలోని వర్గ వైషమ్యాలనూ, శిధిలమవుతున్న శక్తుల చర్యలనూ బాగానే గమనించారు. కానీ, ఇంకా శైశవ దశలో వున్న కార్మికవర్గం చారిత్రకంగా ఎలాంటి చొరవా లేని శక్తిగానూ, ఏ విధమైన స్వతంత్ర రాజకీయ ఉద్యమంగానీ లేని వర్గంగానూ వాళ్ళకు కనబడింది.



సెయింట్ సైమన్ హెన్రీ
**(1760-1825)**
ఫ్రెంచ్ ఊహాజనిత సోషలిస్ట్

పరిశ్రమలు అభివృద్ధి అయినంత మేరకే వర్గవైషమ్యాలు అభివృద్ధి చెందుతాయి కాబట్టి వారి కళ్ళ ముందున్న ఆర్థిక పరిస్థితిలో కార్మికవర్గ విమోచనకు అవసరమైన భౌతిక పరిస్థితులు అప్పటికి కనబడవు. కాబట్టి వాళ్ళు ఆ భౌతిక పరిస్థితులను సృష్టించగల నూతన సామాజిక శాస్త్రం కొరకు, నూతన సామాజిక నియమాల కొరకు అన్వేషిస్తారు.

వీళ్ళ సొంత సృజనాత్మక చర్య ముందు చారిత్రక చర్యకేమీ విలువ లేదు. వీళ్ళ అభూత కల్పిత పరిస్థితుల ముందు చారిత్రకంగా సృష్టి అయ్యే విమోచన పరిస్థితులకేమీ విలువ లేదు. ఈ సృష్టికర్తలు, ప్రత్యేకంగా తయారుచేసిన సామాజిక వ్యవస్థ ముందు క్రమక్రమంగా నెమ్మదిగా, యాదృచ్ఛికంగా జరిగే కార్మికుల వర్గ నిర్మాణానికేమీ విలువ లేదు. వారి దృష్టిలో వారి సామాజిక పథకాలను ప్రచారం చేసి అమలుపరచడమే భావి చరిత్ర.

తమ పథకాలను రూపొందించడంలో అత్యంత బాధాతప్త వర్గమైన కార్మికవర్గపు ప్రయోజనాలపట్ల ప్రధానంగా శ్రద్ధ వహిస్తున్నామని వీళ్ళకు తెలుసు. వీళ్ళ దృష్టిలో కార్మికవర్గానికి వున్న విలువ అంతా అది అత్యంత బాధాతప్త వర్గంగా వుండడం మాత్రమే.

వర్గపోరాటమూ, వారి పరిసరాలూ అభివృద్ధి కాని స్థితిలో వుండటం వల్ల యీ రకం సోషలిస్టులు తాము వర్గ వైషమ్యాలకు ఎంతో అతీతంగా వున్నట్లు



**ఫోరియర్ ఛార్లెస్**
**(1772-1837)**
**ఫ్రెంచ్ ఊహాజనిత సోషలిస్ట్**

భావించుకుంటారు. సమాజంలో ప్రతి వ్యక్తి పరిస్థితినీ, అత్యంత ఉచ్ఛస్థితిలో వున్నవాని పరిస్థితిని కూడా మెరుగుపరచాలని వీరు కోరుకుంటారు. అందువల్ల వీరు వర్గవిభేదాలతో సంబంధం లేకుండా మొత్తం సమాజానికి విజ్ఞప్తి చేస్తారు; అంతేకాదు - ముఖ్యంగా పాలక వర్గానికి విజ్ఞప్తి చేయడానికి ప్రాధాన్యత ఇస్తారు. తమ సిద్ధాంతం ఒక్కసారి ప్రజలకు అర్థమైతే, ఇక అదే అత్యుత్తమ సమాజానికి అత్యుత్తమ పథకమని వాళ్ళు గుర్తించకుండా వుండగలరా ? అని వారు భావించారు.

అందువల్ల వీళ్ళు సకల రాజకీయ కార్యకలాపాలనూ, మరీ ముఖ్యంగా సకల విప్లవ కార్యకలాపాలనూ నిరాకరిస్తారు; శాంతియుత పద్ధతుల ద్వారా తమ లక్ష్యాలు సాధించుకోవాలని కోరుకుంటారు; విఫలం కాక తప్పని చిన్నచిన్న ప్రయోగాల ద్వారానూ, ఆదర్శప్రాయమైన చర్యల ద్వారానూ తమ నూతన సామాజిక మతబోధనలకు బాట వేయడానికి కృషి చేస్తారు.

కార్మికవర్గం ఇంకా బొత్తిగా అభివృద్ధి కాని దశలో, కార్మికవర్గానికి తన స్థానం గురించి తనకే అభూత కల్పనతో కూడిన అవగాహన వుండే దశలో, భవిష్యత్ సమాజం గురించి ఈ అభూత కల్పనతో కూడిన చిత్రాలు చిత్రితమవుతాయి. సమాజమంతా పునర్నిర్మాణం కావాలని ఆ వర్గానికుండే సహజాతమైన తొలి వాంఛలకు అనుగుణంగా ఈ చిత్రాలు వుంటాయి.

కానీ ఆ సోషలిస్టు కమ్యూనిస్టు ప్రచురణలలో విమర్శనాత్మక అంశాలు కూడా ఉన్నాయి. ఇవి సమకాలీన సమాజ సూత్రాలన్నిటిపై దాడి చేస్తాయి. అందువల్ల వాటిలో కార్మికవర్గానికి విజ్ఞానదాయకమైన అత్యంత విలువైన విషయాలు చాలా వున్నాయి. వాటిలో ప్రతిపాదించిన ఆచరణాత్మక అంశాలు - పట్టణాలకూ,



ఓవెన్ రాబర్ట్
**(1771-1858)**
బ్రిటిష్ ఊహాజనిత సోషలిస్ట్

గ్రామాలకూ మధ్యగల భేదాన్ని రద్దు చేయడం, కుటుంబాన్ని రద్దు చేయడం, వ్యక్తుల లాభాల కొరకు పరిశ్రమలు నడిపే పద్ధతి రద్దు చేయడం, వేతన కూలీ వ్యవస్థను రద్దు చేయడం, సామాజిక సామరస్యం ప్రకటించడం, రాజ్య విధులను కేవలం ఉత్పత్తిని అజమాయిషీ చేసే పనికి మాత్రమే పరిమితం చేయడం – ఈ ప్రతిపాదనలన్నీ వర్గ వైషమ్యాలు అంతరించిపోవాలని మాత్రమే సూచిస్తాయి. అప్పుడు మాత్రమే తల ఎత్తుతున్న వర్గ వైషమ్యాలు, తొలినాటి అస్పష్ట అనిర్దిష్ట రూపాలలో మాత్రమే వారి ప్రచురణలలో గుర్తింపు పొందాయి. అందువల్ల ఆ గ్రంథాలలోని ప్రతిపాదనలు కేవలం ఊహాజనిత స్వభావాన్ని మాత్రమే కలిగి వున్నాయి.

విమర్శనాత్మక ఊహాజనిత సోషలిజం, కమ్యూనిజంల ప్రాముఖ్యతకు చారిత్రకాభివృద్ధికీ మధ్య విలోమ సంబంధం వుంటుంది. ఆధునిక వర్గ పోరాటం అభివృద్ధి అయి ఒక నిర్దిష్ట రూపం తీసుకొనే కొద్దీ, ఈ పోరాటానికి దూరంగా వుండటమూ, పోరాటాన్నే ఖండించటమూ, అనే ఈ వైపరీత్యాలు ఆచరణరీత్యా పూర్తిగా విలువను కోల్పోతాయి; సిద్ధాంతరీత్యా పూర్తిగా అసమర్థనీయమూ అవుతాయి. అందువల్ల ఈ సిద్ధాంతాల మూల పురుషులు అనేక విషయాల్లో విప్లవకారులుగా వున్నప్పటికీ, వాళ్ళ శిష్యులు ప్రతి విషయంలోనూ ప్రగతి నిరోధక ముఠాలుగా మాత్రమే ఏర్పడ్డారు. కార్మికవర్గం క్రమక్రమంగా చారిత్రకాభివృద్ధి చెందుతున్నప్పటికీ, దానికి వ్యతిరేకంగా వీళ్ళు తమ గురువుల మూలాభిప్రాయాలను గట్టిగా పట్టుకుంటారు. అందువల్ల వీళ్ళు వర్గపోరాటాన్ని నిర్వీర్యం చేయడానికీ, వర్గ వైషమ్యాలకు రాజీ కుదిరించడానికి గట్టిగా కృషి చేస్తారు. ఆ చేయడంలో ఏ మినహాయింపులు వుండవు కూడా. ప్రయోగాల ద్వారా తమ ఊహాజనిత సమాజాన్ని

సాధించాలని కలలుగంటారు. ఏకాకి "ఫలాన్‌స్టీర్లు" స్థాపించాలనీ, "హోమ్ కాలనీలు" ప్రతిష్టించాలనీ, "చిట్టి ఇకేరియా" నెలకొల్పాలనీ "నూతన జెరూసలేమ్" వంటి బుల్లి బుల్లి స్వర్గాలను స్థాపించాలనీ వీళ్ళు ఇంకా కలలు కంటూనే వుంటారు.[64] ఈ గాలి మేడలను నిజం చేయడానికి వీళ్ళు బూర్జువాల జాలి గుండెలకూ, వారి డబ్బు సంచులకూ విన్నపాలు చేయకతప్పదు. క్రమక్రమంగా వీళ్ళు పైన వివరించిన ప్రగతి నిరోధక యథాస్థితివాద సోషలిస్టుల స్థాయికి దిగజారిపోతారు. యథాస్థితివాద సోషలిస్టులకూ, వీళ్ళకూ గల భేదమల్లా ఏమిటంటే, వీళ్ళకు ఇంకా ఎక్కువ క్రమబద్ధమైన ఛాందస పాండిత్యం వుంటుంది. అంతేగాక తమ సామాజిక శాస్త్రం అద్భుత ఫలితాలనిస్తుందని వీళ్ళకు మొండి మూఢవిశ్వాసం వుంటుంది.

అందువల్ల వీళ్ళు కార్మికవర్గ రాజకీయ కార్యకలాపాలనన్నిటినీ తీవ్రంగా వ్యతిరేకిస్తారు; ఈ కార్యకలాపాలన్నీ తమ నూతన మతబోధనల మీద గల గుడ్డి అపనమ్మకం మూలంగానే కలుగుతున్నాయని వారి భావన.

ఇంగ్లండులో ఓవెన్ అనుచరులు చార్టిస్టులనూ[65], ఫ్రాన్స్‌లో ఫోరియర్ అనుచరులు రిఫార్మిస్టులనూ[66] వ్యతిరేకిస్తారు.



రాబర్ట్ ఓవెన్ ప్రతిపాదించిన స్వయం పాలిత సమాజపు నమూనా

4

# ఈనాటి వివిధ ప్రతిపక్ష పార్టీలపట్ల కమ్యూనిస్టుల వైఖరి

ఇంగ్లండులో చార్టిస్టులూ, అమెరికాలో భూసంస్కరణ వాదులూ మొదలైన నేటి కార్మికవర్గ పార్టీలతో కమ్యూనిస్టులకు గల సంబంధాన్ని రెండవ ప్రకరణంలో స్పష్టం చేశాం.

కమ్యూనిస్టులు కార్మికవర్గ తక్షణ లక్ష్యాలు సాధించడానికీ, తాత్కాలిక ప్రయోజనాలు అమలుపరచడానికీ పోరాటం చేస్తారు. కానీ వాళ్ళు వర్తమాన ఉద్యమంలో ఉద్యమ భవిష్యత్తుకు కూడా ప్రాతినిధ్యం వహిస్తూ, ఆ భవిష్యత్తు పట్ల కూడా శ్రద్ధ వహిస్తారు. ఫ్రాన్సులో కమ్యూనిస్టులు యథాస్థితివాద అతివాద బూర్జువాలకు వ్యతిరేకంగా సోషల్ డెమోక్రట్లతో[67] పొత్తు కలుస్తారు. కానీ, ఫ్రెంచి మహా విప్లవ కాలం నుండి సాంప్రదాయకంగా వస్తున్న మాటలనూ, భ్రమలనూ విమర్శించే హక్కు మాత్రం తాము తమ వద్దనే ఉంచుకుంటారు.

స్విట్జర్లాండులో కమ్యూనిస్టులు రాడికల్ పార్టీని బలపరుస్తారు. కానీ, ఆ పార్టీలో పరస్పర విరుద్ధమైన ధోరణులు వున్నాయనే వాస్తవాన్ని మరచిపోరు. అంటే అతివాద బూర్జువాలు కొందరూ, ఫ్రాన్సులో వున్న డెమోక్రటిక్ సోషలిస్టులు కొందరూ వున్నారని వారు విస్మరించరు.

పోలండులో జాతీయ విమోచనకు వ్యవసాయ విప్లవం ప్రాథమిక షరతు అని పట్టుబట్టే పార్టీని, 1846 నాటి క్రాకోవ్ తిరుగుబాటును లేవదీసిన ఆ పార్టీని, కమ్యూనిస్టులు బలపరుస్తారు[68].

జర్మనీలో బూర్జువావర్గం విప్లవకరంగా ఉద్యమించినప్పుడల్లా, కమ్యూనిస్టులు ఆ బూర్జువావర్గంతో కలిసి నిరంకుశ రాజరికానికీ, ఫ్యూడల్ ప్రభువర్గానికీ, పెటీ బూర్జువావర్గానికీ వ్యతిరేకంగా పోరాటం చేస్తారు.

కానీ, బూర్జువావర్గానికీ కార్మికవర్గానికీ మధ్య గల శత్రుత్వాన్ని కార్మికులు సుస్పష్టంగా గుర్తించేటట్లు చేయడానికి కమ్యూనిస్టులు ఒక క్షణం కూడా విరామం

లేకుండా కృషి చేస్తారు. బూర్జువా వర్గం తాను అధికారంలోకి వచ్చినప్పుడు ఆ అధికారం వెంట విధిగా ప్రవేశపెట్టే సాంఘిక రాజకీయ పరిస్థితులను జర్మన్ కార్మికులు వెనువెంటనే బూర్జువా వర్గం మీద ఆయుధాలుగా ఉపయోగించేందుకూ, జర్మనీలో ప్రగతి నిరోధక వర్గాలు పతనమైన తర్వాత తక్షణమే బూర్జువా వర్గానికి వ్యతిరేకంగా పోరాటం ప్రారంభించేందుకూ ఈ కృషి అవసరం.

కమ్యూనిస్టులు ప్రధానంగా జర్మనీ మీదికి దృష్టి మళ్ళిస్తారు. ఎందుకంటే, ఆ దేశం బూర్జువా విప్లవ ప్రాంగణంలో ఉంది. అంతేగాక, 17వ శతాబ్దపు ఇంగ్లండులో కంటే, 18వ శతాబ్దపు ఫ్రాన్సులో కంటే బాగా అభివృద్ధి చెందిన కార్మికవర్గంతోనూ, గతంలో కంటే బాగా అభివృద్ధి చెందిన యూరోపియన్ నాగరికతా వాతావరణంలోనూ ఆ జర్మన్ బూర్జువా విప్లవం జరిగి తీరుతుంది. ఆ బూర్జువా విప్లవం ఆ తర్వాత వెనువెంటనే వచ్చే కార్మికవర్గ విప్లవానికి ఉపోద్ఘాతంగా వుంటుంది. ఈ కారణాల వల్ల కమ్యూనిస్టులు ప్రధానంగా జర్మనీ మీదకు తమ దృష్టి మళ్ళిస్తారు.

ఒక్క మాటలో చెప్పాలంటే, కమ్యూనిస్టులు ప్రతిచోటా ఆనాటి సామాజిక, రాజకీయ పరిస్థితులకు వ్యతిరేకంగా జరిగే ప్రతి విప్లవోద్యమాన్నీ బలపరుస్తారు.

ఆ నాటికి ఆస్తి వ్యవస్థ ఏ మేరకు అభివృద్ధి చెంది ఉన్నా సరే, ఈ అన్ని ఉద్యమాలలోనూ వాళ్ళు ఆస్తి సమస్యను ప్రధాన సమస్యగా ముందుకు తెస్తారు.

చివరి విషయం : అన్ని దేశాల ప్రజాతంత్ర పార్టీల మధ్యా ఐకమత్యమూ, ఏకీభావం నెలకొల్పడానికి కమ్యూనిస్టులు తీవ్రంగా కృషి చేస్తారు.

కమ్యూనిస్టులు తమ అభిప్రాయాలనూ, లక్ష్యాలనూ దాచుకోవడాన్ని అసహ్యించుకొంటారు. సమస్త వర్తమాన సాంఘిక పరిస్థితులను బలవంతంగా కూలదోయటం ద్వారా మాత్రమే తమ లక్ష్యాలు సిద్ధించగలవని వాళ్ళు బహిరంగంగానే ప్రకటిస్తారు. కమ్యూనిస్టు విప్లవమంటే పాలకవర్గాలు గజగజ వణకనీ, కార్మికులకు పోయేదేమీ లేదు, తమ సంకెళ్ళు తప్ప. వారు గెలుచుకోవటానికి ఒక ప్రపంచమే వుంది.

సకల దేశాల శ్రామికులారా, ఏకంకండి !

# వివరణలు

ఎంగెల్సు యిచ్చిన వివరణలు కాక తక్కిన వివరణలు అనువాదకునివి.

1. **కమ్యూనిస్టు లీగు** – కార్మికవర్గం మొదటి అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థ. దీని స్థాపనకు ముందు మార్క్సు, ఎంగెల్సులు వివిధ దేశాల సోషలిస్టులనూ, అగ్రగామి కార్మికులనూ సిద్ధాంత రీత్యానూ, సంస్థాగతంగానూ కూడగట్టడానికి గణనీయమైన సన్నాహక కృషి చేశారు. ఈ లక్ష్యంతో వాళ్ళు 1846 తొలి భాగంలో బ్రసెల్స్‌లో కమ్యూనిస్టు కరస్పాండెన్స్ కమిటీని నిర్మించారు. ఆ కాలంలో జర్మనీ, ఫ్రాన్సు, స్విట్జర్లాండు, బ్రిటన్‌లలో "న్యాయాత్ముల సంఘం" అనేది వుంది- కార్మికులకూ, చేతి పనివాళ్ళకూ చెందిన రహస్య సంఘం. ఆ సంఘం యొక్క లండన్ నాయకత్వం మార్క్సు, ఎంగెల్సుల భావాల మీద విశ్వాసం కలిగి, వాళ్ళను తమ సంఘంలో చేరడానికీ, దానిని పునర్వ్యవస్థీకరించడానికీ, తమ సూత్రాలకు అనుగుణంగా ఒక కార్యక్రమాన్ని తయారుచేయడానికి ఆహ్వానించారు. మార్క్సు, ఎంగెల్సులు అంగీకరించారు.

   1847 జూన్ తొలి భాగంలో లండన్‌లో జరిగిన "న్యాయాత్ముల సంఘం" మహాసభలో ఎంగెల్సు పాల్గొన్నాడు. సంఘం పేరును "కమ్యూనిస్టు లీగు" గా మార్చారు. "సకల దేశ కార్మికులారా, ఏకం కండి !" అనే సమరశీల అంతర్జాతీయతా నినాదం ఆమోదాన్ని పొందింది. ఆ మహాసభ కమ్యూనిస్టు లీగు ప్రథమ మహాసభగా చరిత్రకెక్కింది. దాని రెండవ మహాసభ లండన్‌లో 1847 నవంబర్ 29 నుండి డిసెంబర్ 8 దాకా జరిగింది. మార్క్సు, ఎంగెల్సులు పాల్గొన్న ఆ మహాసభ, దీర్ఘ చర్చల అనంతరం, శాస్త్రీయ కమ్యూనిజం సూత్రాలను ఏకగ్రీవంగా ఆమోదించింది. దాని అభ్యర్థన మీద మార్క్సు, ఎంగెల్సులు రాసినదే యీ "కమ్యూనిస్టు పార్టీ ప్రణాళిక".

   కొలోన్ కమ్యూనిస్టు కేసు తర్వాత, 1852 నవంబర్ 17న కమ్యూనిస్టు లీగు రద్దయింది. పేజి : 8.

2. **పోప్ (Pope)** – క్రైస్తవ మతంలో ఒక తెగ అయిన కాథలిక్ మతాన్ని అనుసరించే వాళ్ళందరికీ గురువు. రోమ్‌లో వుంటాడు. ప్రపంచంలోని

కాథలిక్ చర్చిలన్నీ అతని అధికారానికి లోబడినవే. కాథలిక్ చర్చిలకు సంబంధించిన పరిపాలన, క్రమశిక్షణ, పూజా విధానం, మతబోధ వగైరాలన్నీ నిర్ణయించేది అతనే. మత సంబంధమైన సిద్ధాంతాలనూ, సూత్రాలనూ వ్యాఖ్యానించే అధికారం అతనికి మాత్రమే వుంది. అతని వ్యాఖ్యానానికి కాథలిక్ ప్రపంచంలో తిరుగులేదు. వివాహమూ, విడాకులూ, కుటుంబ నియంత్రణా మొదలైన విషయాల్లో కూడా ఈనాటికీ కాథలిక్కులకు పోపు చెప్పిందే వేదం – చరిత్రలో ఏ పోపూ ఏ ప్రగతి ఉద్యమాన్నీ మంచిదనలేదు. ఫ్యూడలిజం వున్నన్నాళ్ళూ ఫ్యూడలిజంనూ, అటు తర్వాత పెట్టుబడిదారీ విధానాన్నీ సమర్థించడమే పోపు చరిత్ర. పేజి :14.

3. **జారు (Czar)** - రష్యా చక్రవర్తిని జారు అంటారు. పేజి :14.

4. **మెటర్నిక్ (Metternich, Clemens Wenzel) (1773-1859)**- ఆస్ట్రియన్ రాజనీతిజ్ఞుడూ, దౌత్యనిపుణుడూ; చిన్నప్పుడు ఫ్రెంచి విప్లవానుభవంతో రాజకీయ మార్పు అంటేనే ద్వేషం పెంచుకున్నాడు. యూరప్‌లో విప్లవోద్యమాలనన్నిటినీ అణచి 'స్థిరత్వం' స్థాపించడానికి యూరోపియన్ ప్రభుత్వాలు కలిసికట్టుగా పని చేయాలనేది అతని రాజకీయ విధానంలోని ముఖ్య సూత్రం. సుమారు 30 ఏండ్లు ఆస్ట్రియా సామ్రాజ్యానికి ప్రధాన మంత్రి (ఛాన్సలర్)గా వుండి, 1848 మార్చి విప్లవంలో రాజీనామా యిచ్చి ప్రాణ భీతితో పారిపోయాడు. పేజి : 14.

5. **గీజో (Guizot, Francois Pierre) (1787-1874)** - ఫ్రెంచి చరిత్రకారుడూ, రాజనీతిజ్ఞుడూ, అనేక సంవత్సరాలు మంత్రిగా వుండి, 'కమ్యూనిస్టు మానిఫెస్టో' రచనా కాలం నాడు (1847) ఫ్రెంచి ప్రధాన మంత్రిగా వున్నాడు. 1848 ఫిబ్రవరి విప్లవంలో అతనూ దిగిపోయాడు. అతని రాజూ ఇంగ్లండుకు పారిపోయాడు. తన రచనలలో చరిత్రను వర్గపోరాటం దృష్ట్యా పరిశీలించడానికి మొదటి ప్రయత్నాలు చేశాడు. కానీ ఆ పరిశీలన బూర్జువా వర్గ దృక్కోణం నుండి చేశాడు. పేజి : 14.

6. **రాడికల్ పార్టీ వాళ్ళు – రాడికల్ (radical)** – అంటే మౌలికమైన అని అర్థం. కాబట్టి మౌలికమైన మార్పులూ, తీవ్రమైన మార్పులూ కావాలనే

వాళ్ళను రాడికల్స్ అంటారు. కానీ ఫ్రెంచి రాడికల్ పార్టీ వాళ్ళు పెట్టుబడిదారీ వ్యవస్థను సమర్థించడంలో మాత్రమే తీవ్రత్వం కనపరిచారు. సోషలిజం వాసన కూడా వాళ్ళకు గిట్టదు. కనుక వాళ్ళు కమ్యూనిస్టులనే గాక, సోషల్ డెమోక్రట్లను కూడా వ్యతిరేకించారు. పేజి : 14.

**7.** బూర్జువాలు అంటే సమాజపు ఉత్పత్తి సాధనాల సొంతదార్లూ, యితరుల చేత కూలిపని చేయించుకునేవాళ్ళూ అయిన ఆధునిక పెట్టుబడిదార్లు. కార్మికులు అంటే సొంత ఉత్పత్తి సాధనాలు లేనందువల్ల, బతకడానికి తమ శ్రమ శక్తిని యితరులకు అమ్ముకోవలసిన కూలివాళ్ళు (1888 నాటి ఇంగ్లీషు కూర్పుకు ఎంగెల్సు వివరణ).

"బూర్జువా" అనేది ఫ్రెంచి పదం. పెట్టుబడిదార్లూ, పెట్టుబడిదారీ విధానమూ పుట్టక ముందే యీ పదం పుట్టింది. పట్టణ పౌరుడు అని వ్యుత్పత్తి అర్థం. ఫ్యూడల్ బాధ్యతలు లేకుండా పట్టణాలలో స్వతంత్రంగా బతికే వర్తకులనూ, చేతి పనులవాళ్ళనూ, వృత్తి సంఘ సభ్యులనూ బూర్జువాలని అనే వాళ్ళు. ఫ్యూడల్ ప్రభువులు పై వర్గంగా వున్న ఫ్యూడల్ సమాజంలో బూర్జువాలను మధ్యతరగతిగా లెక్కించేవాళ్ళు. ఉత్పత్తిలో యంత్రాలు ప్రవేశించేకొద్దీ క్రమక్రమంగా బూర్జువాలే పెట్టుబడిదార్లుగా అభివృద్ధి చెందారు. తరువాత డబ్బున్న భూస్వాములు కూడా పెట్టుబడిదార్లుగా మారారు. ఫ్యూడల్ ప్రభువులు లేని యీ నాటి సమాజంలో బూర్జువా వర్గమే పై తరగతి. కార్మికులూ, బూర్జువాలు కానివాళ్ళు మధ్యతరగతి. పేజి : 15.

**8.** చరిత్ర అంటే లిఖిత చరిత్ర మాత్రమే. నాగరికత పుట్టక పూర్వం ఆదిమ సమాజంలో ఆస్తీ లేదు, వర్గాలూ లేవు. 1847లో ఆదిమ మానవ చరిత్ర దాదాపు ఏమీ తెలియదు. తరువాత 20 ఏండ్ల లోపలనే అనేక పరిశోధనల ఫలితంగా ఆదిమ చరిత్ర బాగా వెల్లడైంది. వర్గభేదాలు లేని ఆదిమ కమ్యూనిస్టు సమాజం నుండి కుటుంబం అనేదీ, ఆస్తి అనేదీ, రాజ్యం అనేదీ ఏ విధంగా పుట్టిందీ 'కుటుంబమూ, వ్యక్తిగత ఆస్తీ, రాజ్యాంగాల పుట్టుక' అనే గ్రంథంలో ఎంగెల్సు వివరించాడు. (1888 నాటి ఇంగ్లీషు కూర్పు 'కమ్యూనిస్టు మానిఫెస్టో' లో ఎంగెల్సు ఒక వివరణ కూడా యిచ్చాడు). పేజి : 15

9. **వృత్తి సంఘ యజమాని (guild-master)** – వృత్తి సంఘంలో పూర్తి హక్కులు గల సభ్యుడు : వృత్తి సంఘంలోని ఒక యజమాని, కానీ దాని అధిపతి కాదు. (1888 నాటి ఇంగ్లీషు కూర్పుకు ఎంగెల్సు వివరణ).

ఒక పట్టణంలోని ఒకే వృత్తి చేసే చేతిపని వాళ్ళు అందరూ కలిసి ఒక సంఘంగా ఏర్పడుతారు. అదే వృత్తి సంఘం. అందులో సభ్యులందరూ యజమానులే. ఇతరులకు ప్రవేశం ఉండదు. తరువాత గ్రామాల నుండి పారిపోయి వచ్చిన చేతిపనివాళ్ళు ఆ యజమానుల క్రింద కూలివాళ్ళుగా పని చేయవచ్చునేగాని, సంఘంలో సభ్యులు కాలేరు. ఆ కూలి వాళ్ళే వృత్తి సంఘ కార్మికులు. పేజి : 15

10. పట్టణాలలోని చేతిపనివాళ్ళూ, వర్తకులూ ఫ్యూడల్ ప్రభువుల పెత్తనానికి లోబడకుండా స్వతంత్రులుగా బతకవచ్చునని ఆ దేశపు రాజులు శాసనాలు చేసే వాళ్ళు. కాబట్టి వాళ్ళు శాసనరక్షిత స్వతంత్ర పౌరులు (Chartered burghers). ఫ్యూడల్ ప్రభువుల కింద దాసులుగా వున్న వాళ్ళు పారిపోయి దూరపు పట్టణాలు చేరి, అనేక పోరాటాల తర్వాత యీ స్వాతంత్ర్యం సంపాదించుకొన్నారు. ఆ పట్టణాలనే కమ్యూన్‌లు అనేవాళ్ళు. పట్టణాలలోని సరుకుల ఉత్పత్తివల్లా, వర్తకంవల్లా రాజులకు ఆదాయం వచ్చేది. అంతేగాక రాజులకు, ఫ్యూడల్ ప్రభువులకూ రాజకీయ వైరుధ్యం వుండేది. ఈ కారణాలవల్లా, పట్టణ ప్రజల పోరాటాల ఫలితంగానూ పై రాజ శాసనాలు పుట్టేవి. పేజి : 16

11. **కార్ఖానాల వ్యవస్థ (manufacturing system)** – పెట్టుబడిదార్ల కింద కార్మికులు పనిచేసే వ్యవస్థ. కానీ ఇంజన్లూ, ఇంజన్లతో నడిచే పెద్ద యంత్రాలూ ఆనాటికి లేవు. మగ్గాల వంటి సాధనాలు మాత్రం వున్నాయి. శ్రమ విభజన వుంది. పేజి : 16

12. మధ్యయుగపు ఫ్రాన్సులో శైశవదశలో వున్న పట్టణాలకు కమ్యూన్‌లు అని పేరు. ఆ పట్టణాలు తమ యజమానులైన ఫ్యూడల్ ప్రభువులతో పోరాడి స్థానిక స్వపరిపాలనా, మూడవ అంతస్తుగా రాజకీయ హక్కులూ సంపాయించుకోకముందే, వాటికి కమ్యూన్‌లు అనే పేరు వచ్చింది.

స్థూలంగా, బూర్జువా వర్గం యొక్క ఆర్థిక అభివృద్ధికి ఇంగ్లండును ఆదర్శ ప్రతినిధిగానూ, దాని రాజకీయ అభివృద్ధికి ఫ్రాన్సును ఆదర్శ ప్రతినిధిగానూ తీసుకున్నాము. (1888 నాటి ఇంగ్లీషు కూర్పుకు ఎంగెల్సు వివరణ).

ఇటలీ, ఫ్రాన్సుల పట్టణ ప్రజలు ఫ్యూడల్ ప్రభువులకు డబ్బు యిచ్చో, లేక పోరాటం ద్వారానో, స్వపరిపాలనకు సంబంధించిన మొదటి హక్కులు సంపాయించుకొన్న తర్వాత తమ పట్టణ సమాజాలకు కమ్యూన్‌లు అని పేరు పెట్టుకున్నారు. (1890 నాటి జర్మన్ కూర్పుకు ఎంగెల్సు వివరణ). పేజి : 17

13. **"మూడవ అంతస్తు" (Third Estate)** – ఇంగ్లండులో మతగురువులు మొదటి అంతస్తు. ఫ్యూడల్ ప్రభువులు రెండవ అంతస్తు, కామన్స్ సభ మూడవ అంతస్తు. ఫ్రాన్సులో ఫ్యూడల్ ప్రభువులు మొదటి అంతస్తు, మత గురువులు రెండవ అంతస్తు, ఫ్యూడల్ పెత్తనం కిందలేని కమ్యూన్‌లు మూడవ అంతస్తు. పేజి : 17

14. **ఈజిప్టు పిరమిడ్లు** – పురాతన ఈజిప్టులో రాజుల సమాధుల మీద కట్టిన బ్రహ్మాండమైన కట్టడాలు. వీటిలో అన్నిటికంటే పెద్దది క్రీ.పూ. 38 లో కట్టింది. నేల మీద దీని విస్తీర్ణం 13 ఎకరాలకు పైగా వుంటుంది. పైకి పోను పోను విస్తీర్ణం తగ్గుతుంది. దీని ఎత్తు 482 అడుగులు, ప్రపంచపు ఏడు వింతల్లో ఇది ఒకటి. పేజి : 18

15. **రోమన్ ఆక్విడక్టులు** – ఇవి తవ్వినవి కావు, భూమి మీద కట్టినవి. రోమనులు గొప్ప యింజనీర్లు. రోమ్ నగరానికి నీళ్ళు సరఫరా కావడానికి అందమైన కమాన్ల మీద తొమ్మిది కాలువలు కట్టారు – అందులో అధిక భాగం యిప్పటికీ నీళ్ళు సరఫరా చేస్తున్నాయి. పేజి : 18.

16. **గాథిక్** అనేది వాస్తు శిల్పంలో ఒక శైలి. 12–15వ శతాబ్దాలలో కొన్ని యూరోపియన్ దేశాలలో ముఖ్యమైన వాస్తు శిల్పశైలిగా వుంది. పేజి : 18

17. 4–5వ శతాబ్దాలలో యూరప్ తూర్పు నుండి పశ్చిమానికి సాగిన తెగల, ప్రజల సామూహిక వలస ప్రయాణాలకు ప్రస్తావన. పేజి : 18

**18. మత దండయాత్రలు (Crusades)**- పశ్చిమ యూరప్ ఫ్యూడల్ ప్రభువులు పరదేశాలను దోచుకోవడమూ, భూములను ఆక్రమించుకోవడమూ అనే ఉద్దేశ్యంతో 1096-1270లలో చేసిన దండయాత్రలు. ఈ దండయాత్రలు ముఖ్యంగా ముస్లింల మీద మధ్య ప్రాచ్యంలో జరిగాయి. తమ ఆక్రమణ లక్ష్యాలను దండయాత్రీకులు మతం సాకుతో మరుగుపరిచారు. ఈ దండయాత్రలలో ముఖ్యమైన భాగస్వాములు క్రైస్తవ చర్చీ, పశ్చిమ రాజులూ, ప్రభువులూ, ఇటాలియన్ వర్తకులూ. పేజి : 18

**19. ఉత్పత్తి సాధనాలు (Instruments of Production)** - యంత్రాలూ, పనిముట్లూ, పంటలు పండే భూములూ, గనులూ-ఇవన్నీ ఉత్పత్తి సాధనాలు. పేజి :19

**20. మేధోపరమైన ఉత్పత్తి (Intellectual Production)** - మేధస్సుతో (మెదడుతో) చేసే ఉత్పత్తి; సాహిత్యమూ, కళలూ, మతమూ, తత్వశాస్త్రమూ, విజ్ఞాన శాస్త్రాలూ, ఇలాంటివన్నీ మేధస్సుతో ఉత్పత్తి అయ్యేవి. పేజి : 20

**21. ఉత్పత్తి శక్తులు (Productive Forces)** - ఉత్పత్తి సాధనాలూ, కార్మికులూ, రవాణా సాధనాలూ - ఈ అన్నిటినీ కలిపి ఉత్పత్తి శక్తులు అంటారు. ఈనాడు శాస్త్ర విజ్ఞానం (సైన్సు) ఉత్పత్తిలో బాగా వినియోగపడుతున్నది గనుక, అది కూడా ఒక ఉత్పత్తి శక్తే. పేజి : 21

**22. మారకపు సాధనాలు (Means of Exchange)** - వస్తువులు మార్చుకోవడానికి ఉపయోగించే సాధనం. బూర్జువా సమాజంలో డబ్బే మారకపు సాధనం. పేజి : 21

**23. స్వేచ్ఛాయుత పోటీ (Free Competition)** - బూర్జువా ఆర్థిక వ్యవస్థలో ప్రతి ఒకనికీ ఏ సరుకునైనా తన యిష్టం వచ్చిన ధరకు అమ్మడానికీ, కొనడానికీ స్వేచ్ఛ వుంది. దానినే వ్యాపార స్వేచ్ఛ అంటారు. అటువంటి వ్యాపారాన్ని స్వేచ్ఛా వ్యాపారం (Free Trade) అంటారు. కనుక సరుకులు అమ్మడంలోనూ, కొనడంలోనూ ఏ మినహాయింపులూ లేని పోటీ వుంటుంది. పేజి : 22

**24.** మార్కెట్లు విస్తరించేకొద్దీ, మార్కెట్ల దోపిడీ తీవ్రమయ్యేకొద్దీ, ఉత్పత్తి శక్తులు యింకా పెరుగుతాయి. అందువల్ల రానున్న సంక్షోభాలు యింకా తీవ్రంగా వుంటాయి. పేజి :23

**25.** **శ్రమ (Labour)** – మార్క్సు, ఎంగెల్సులు తమ తర్వాతి రచనల్లో 'శ్రమ' అనే పదానికి బదులు 'శ్రమశక్తి' (Labour Power) అని వాడారు. ఇప్పుడు 'శ్రమశక్తి' అనే పదమే సర్వత్రా వాడుకలో వుంది. కార్మికుడు అమ్ముకునేది శ్రమ శక్తిని మాత్రమే. పేజి : 24

**26.** **పారిశ్రామికులు కాని బూర్జువాలు** – వందల వేల ఎకరాల భూమిని పెట్టుబడిదారీ పద్ధతిలో సొంత వ్యవసాయం చేసే వాళ్ళూ, పెద్ద వర్తకులూ, వడ్డీ వ్యాపారస్తులూ. పేజి : 26

**27.** **పది గంటల పని బిల్లు (Ten hours Bill)** – ఫ్యాక్టరీ కార్మికులు రోజుకు పది గంటలు మాత్రమే పని చేయాలనే శాసనం ఇంగ్లండులో 1847లో వచ్చింది. అంతకు పూర్వం కార్మికులతో ఎన్ని గంటలు పని చేయించుకున్నా అడిగే దిక్కులేదు. ఈ శాసనం స్త్రీలకూ, పిల్లలకూ మాత్రమే వర్తించేది. ఆచరణలో కొంత మంది పురుషులకు కూడా వర్తించేది.

అంతకు ముందు కార్మికులు ఎన్నో ఏండ్లు పోరాడినా పది గంటల పని బిల్లు పాసు కాలేదు. బూర్జువా వర్గంలోని చీలిక వల్ల 1847లో పాసయింది. విదేశాల నుండి దిగుమతి అయ్యే గోధుమల మీద 1815 నుండి ఇంగ్లండులో సుంకాలు విధించే వాళ్ళు. అందువల్ల ఇంగ్లీషు భూస్వాముల గోధుమలకు మంచి ధర వచ్చేది. దీనికి వ్యతిరేకంగా కార్మికులూ, పారిశ్రామిక బూర్జువాలూ ఉద్యమం లేవదీసి ఆ సుంకాలు రద్దు చేయించారు. దీనికి ప్రతి క్రియగా భూస్వాములు, పారిశ్రామిక బూర్జువాల మీద కసితో, పది గంటల పని బిల్లుకు అనుకూలంగా పార్లమెంటులో ఓటు చేశారు. పేజి : 27

28. ఒక సరుకు ఉత్పత్తి మీద గుత్తాధిపత్యం కలవాళ్ళు ఆ సరుకును ఇతర్లు కూడా ఉత్పత్తి చేస్తే నష్టపడతారు. అలాగే, ఒక సరుకును విదేశాల నుండి దిగుమతి చేసి వర్తకం చేసే బూర్జువాలు ఆ సరుకు స్వదేశంలోనే ఉత్పత్తి అయితే నష్టపడతారు. ఈ రెండు రకాల బూర్జువాలూ పరిశ్రమల అభివృద్ధి వల్ల నష్టపడేవాళ్ళు. పేజి : 27

**29.** **ప్రమాదకర వర్గం (Dangerous Class)** – అనగా లంపెన్ ప్రొలిటేరియట్ – దొంగలూ, రౌడీలూ, జేబుదొంగలూ, జూదగాళ్ళూ మొదలైనవాళ్ళు. వీళ్ళు

సమాజానికి అక్కరకొచ్చే పని ఏదీ చేయరు. సమాజంలో ఏ వర్గానికీ చెందరు. సమాజంలోని మురికి అంతా కలిసి తెట్టెగా యీ "ప్రమాదకర వర్గ"మైంది. పేజి : 29

**30.** **కమ్యూన్** – వివరణ 12 చూడండి. పేజి : 30

**31.** **సజీవ శ్రమ** – కార్మికుడు. పేజి : 35

**32.** **పోగుబడిన శ్రమ** – పెట్టుబడి. పేజి : 35

**33.** **గుత్తాధిపత్యం సాధించగల సామాజిక శక్తి (Social Power Capable of Being Monopolised)** – ఒక ఫ్యాక్టరీ ఒకని ఆస్తి అంటే ఆ ఫ్యాక్టరీ మీద వానికి మాత్రమే సర్వాధికారమూ వుంటుంది. అందులో ఎవరికీ భాగం వుండదు. అదే గుత్తాధిపత్యం అంటే. సామాజిక శక్తి అయిన పెట్టుబడి మీద (సమాజంలోని అందరికీ అధికారం లేకుండా) కొంత మంది పెట్టుబడిదార్లకు మాత్రమే యాజమాన్యం వుండడం అని యిక్కడ అర్థం. ఆధునిక పెట్టుబడిదారీ వ్యవస్థలోని గుత్త పెట్టుబడిదార్లను గురించి రాసిందిగాదు యిది – మామూలు పెట్టుబడిదార్లను గురించి రాసిందే. పేజి : 36

**34.** **మధ్యతరగతి (Middle Class)** – మార్పు కాలం నాటికి పెట్టుబడిదార్లనందరినీ మధ్యతరగతి అనే అనేవాళ్ళు. ఫ్యూడల్ యుగంలో పుట్టిన పదం గనుక యీ అర్థం వచ్చింది. ఫ్యూడల్ సమాజంలో ఫ్యూడల్ ప్రభువులూ, భూస్వాములూ పై వర్గం, బూర్జువా వర్గమంతా మధ్యతరగతి. పేజి : 36

**35.** కమ్యూనిస్టు సమాజంలో ఒకడు యజమాని అనీ, ఒకడు కూలివాడు అనీ భేదం వుండదు. పెట్టుబడీ వుండదు, కూలి పనీ వుండదు. నిజానికి పెట్టుబడీ, కూలి పనీ అనేవి విడదీయరానివి. ఒకటి వున్నప్పుడే మరొకటి వుంటుంది. ఒకటి లేకుండా మరొకటి వుండజాలదు. కాబట్టి పెట్టుబడిని రద్దు చేయడం అంటే కూలి పనిని కూడా రద్దు చేయడమే. కాబట్టి 'పెట్టుబడి రద్దయినప్పుడు కూలి పని కూడా రద్దవుతుంది' అనడం ఒక చర్విత చర్వణం (చెప్పిందే చెప్పడం). పెట్టుబడి రద్దయినప్పుడు పని చేయడమే ఆగిపోతుందని పెట్టుబడిదార్లు చెప్పేమాట యీ చర్విత చర్వణానికే మరోరూపం. అంతేగానీ, పని చేయడమేమీ ఆగిపోదు. ఆగిపోయేది కూలి పని మాత్రమే. పేజి :37

వేతనం

**36.** **ప్రాచీన ఆస్తి** – ఫ్యూడలిజం కంటే పూర్వమున్న ఆస్తి, బానిస యుగంలోని ఆస్తి. పేజి : 38

**37.** **కార్మికులకు దేశమనేదంటూ లేదు :** మార్క్స్, ఏంగెల్స్‌లు తమ విప్లవ జీవితం ఆరంభం నుండి అంతర్జాతీయ దృక్పథమును ఆధారం చేసుకునే తమ కృషిని సాగించారు. కార్మికులకు – పెట్టుబడిదారులకు మధ్య ఎక్కడ పోరాటం నడుస్తూ ఉంటే అదే తమ మాతృభూమిగా భావించేవారు. వారు తమ శక్తి సామర్థ్యాలన్నిటినీ కార్మిక వర్గం యొక్క అంతర్జాతీయ సంబంధాలను బలపరచే కృషిలో కేంద్రీకరించారు. అంతే కాదు, అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థను నిర్మించటానికి వారు కృషి చేశారు. కమ్యూనిస్టు లీగ్‌ను నిర్మించటానికి పూర్వమే అంతర్జాతీయంగా కొన్ని ప్రజాతంత్ర సంస్థలను స్థాపించటానికి ఇంగ్లండు, బెల్జియం దేశాల్లో అనేక ప్రయత్నాలు కొనసాగాయి. మార్క్స్, ఏంగెల్స్‌లు ఆ ప్రయత్నాలన్నిటిలోను పాల్గొన్నారు. 1846 సంవత్సరంలో వారు 'వివిధ జాతుల మధ్య సౌభ్రాతృత్వం' అనే నినాదం చేర్పవలసిన అవసరాన్ని నొక్కి వక్కాణించారు. లండన్‌లో అంతర్జాతీయ సమావేశం జరిగిన పిమ్మట ఏంగెల్స్ యీ విధంగా వ్రాశారు:

"ఈ రోజున ఒక్క సోషలిస్టు దృక్పథంతో ఆలోచిస్తేనే 'వివిధ జాతుల మధ్య సౌభ్రాతృత్వం' అనే మాటకు యేమైనా అర్థం ఉంటుంది. నేటి రాజకీయ వ్యవస్థలో శాశ్వతశాంతి అని, యూరోపియన్ ప్రజాతంత్ర సంస్థ అనీ, బూటకపు నినాదాలివ్వటం జరుగుతోంది. అంతర్జాతీయ స్వేచ్ఛా వ్యాపారంలో ప్రజాఐక్యత యేర్పడుతుందనే వాగుడుమాదిరిగా యీ బూటకపు నినాదాలు కూడ హాస్యాస్పదమయ్యాయి. యీ ఊహానిర్మిత సౌధాలమీద మోజు తగ్గిపోయింది. అదే సమయంలో అన్ని దేశాల కార్మికులు కమ్యూనిస్టు ప్రజాతంత్రమనే నినాదం క్రింద శక్తివంతంగా సౌభ్రాతృత్వ మేర్పరచుకో నారంభించారు. నిజానికి ఒక్క కార్మికులే యిట్టి యదార్థమైన సౌభ్రాతృత్వం నిర్మించకోగలరు కూడా. ప్రతి దేశంలో బూర్జువా వర్గానికి ప్రత్యేకమైన వర్గకోరికలున్నాయి. పెట్టుబడిదారులకు తమ వాంఛలే ప్రప్రధానమైనవి గనుక జాతీయత అనే హద్దులను వారు దాటిపోలేరు. వేళ్ళమీద లెక్కించదగినంత మంది సిద్ధాంతవేత్తలు తమ అల్ప సిద్ధాంతాలను యేకరువు

పెడుతున్నారు. అయినప్పటికీ యిక్కడ వారు సాధించగలిగిందేమీ లేదు. ఎందుకంటే, పరస్పర విరుద్ధమైన వాంఛలు, యధార్థ పరిస్థితుల ఒత్తిడి యీ సిద్ధాంతాలను త్రోసిరాజంటున్నాయి. కాని కార్మికుల విషయం యిలా కాదు. ప్రతి దేశంలోని కార్మికులకు ఉన్న కోరిక ఒక్కటే; పోరాడవలసిన శతృవు ఒక్కడే; చేయవలసిన పోరాటం కూడా ఒక్కటే. కార్మిక ప్రజాబాహుళ్యంలో వారి స్వభావాన్ని బట్టి జాతీయద్వేషాలంటూ లేవు. వారి సంస్కృతికి, వారి ఉద్యమాలకు ప్రధానంగా మానవత్వం, అంతర్జాతీయత అనే గుణాలు పునాదులు. కార్మికులు తప్ప మరెవ్వరూ జాతీయ దురహంకారాన్ని నిర్మూలించలేరు. చైతన్యంపొందే కార్మికులు మాత్రమే వివిధ జాతుల మధ్య సౌభ్రాతృత్వాన్ని నెలకొల్పగలరు.

ఉత్పత్తి విధానంలోనూ, సామాజిక వ్యవస్థలోనూ ఉన్నతమైన స్థానాన్ని బట్టి కార్మికవర్గం 'దేశభక్తి' అనే పాతనినాదంలోని బూటకత్వాన్ని చూడగల్గుతోంది. అందుచేత కార్మికవర్గం అంతర్జాతీయ దృక్పధంగల మొట్టమొదటి వర్గం. తత్ఫలితంగా కార్మికవర్గం ఒక నూతనమైన దేశభక్తి నలవరచుకొంట్టుంది. అందులో పూర్వపు అసహనంగాని, సైనికనియంతృత్వంగాని ఉండవు. పేజి. 40

**38.** ఫ్రాన్సులో ఫ్యూడల్ ప్రభువులకు అనుకూలంగా వున్న 10వ చార్లెస్ రాజు ప్రభుత్వం 1830 జులై విప్లవంలో పడిపోయింది. ఆ తర్వాత వచ్చిన లూయీ ఫిలిప్ ప్రభుత్వం బూర్జువాలకు (ముఖ్యంగా బడా బూర్జువాలకు) అనుకూలంగా వుంది. పేజి : 45

**39.** 1832 కు పూర్వం బ్రిటిష్ పార్లమెంటులో భూస్వాములకు ఎక్కువ స్థానాలు వుండేవి. నియోజకవర్గాల విభజన, ఓటు హక్కుకు కావలసిన అర్హత మొదలైన నియమాలు అన్నీ భూస్వాములకు అనుకూలంగా వుండేవి. ఈ ఎన్నికల వ్యవస్థను మార్చడానికి బూర్జువాలు ఉద్యమం ప్రారంభించారు. తత్ఫలితంగా 1832 లో బూర్జువాలకు అనుకూలంగా కొన్ని సంస్కరణలు జరిగాయి. పేజి : 45

**40.** ఫ్యూడల్ ప్రభువులు తరతరాలుగా ఉన్నత వంశీయులు. వాళ్ళ దృష్టిలో కొత్తగా ధనవంతులైన బూర్జువాలు "హఠాత్తుగా పైకి వచ్చిన నీచ జాతి వాళ్ళు" (Upstarts) పేజి : 45

**41.** 1660-1689 మధ్య జరిగిన ఇంగ్లీషు పునస్థాపన కాదు. 1814-1830 మధ్య జరిగిన ఫ్రెంచి పునస్థాపన. (1888 నాటి ఇంగ్లీషు కూర్పుకు ఎంగెల్సు వివరణ).

పునస్థాపన (Restoration) అంటే రాజులను మళ్ళీ గద్దె ఎక్కించడం, రాజులను ఉరితీసి కొన్నాళ్ళు రిపబ్లిక్కులుగా వున్న తర్వాత, 1660 లో ఇంగ్లండులోనూ, 1814లో ఫ్రాన్సులోనూ మళ్ళీ రాజులను తెచ్చి సింహాసనాలు అప్పగించారు. పేజి : 45

**42.** కార్మికవర్గపు బిచ్చపు జోలెను పతాకగా ఎగరవేయడమంటే పీడిత కార్మికుల దృక్కోణం నుండి బూర్జువాలను విమర్శించడం. ఆ విమర్శల వెనుక వుండే ఉద్దేశం ఫ్యూడల్ వ్యవస్థను పునస్థాపించడమే. వాళ్ళ వీపుల (పృష్ట) భాగాల మీద వున్న వంశ చిహ్నాలు అంటే ఆ ఫ్యూడల్ ఉద్దేశాలే. పేజి : 45

**43.** 1814 నుండి 1830 వరకు ఫ్రాన్సులో బూర్బన్ రాజవంశం రాజ్యం చేసింది. ఈ రాజవంశం ఫ్యూడల్ ప్రభువులకు అనుకూలంగా వుంది. 1830 జులై విప్లవం ద్వారా ఆ వంశంలోనే ఒక శాఖ అయిన ఆర్లియన్స్ రాజవంశం సింహాసన మెక్కింది. ఇది బాంకర్లకూ, పెద్ద పెట్టుబడిదార్లకూ అనుకూలంగా వుంది. సింహాసన హక్కు న్యాయంగా బూర్బన్ వంశానిదే అని ఫ్యూడల్ ప్రభువులు వాదిస్తూ వచ్చారు. అందువల్ల వాళ్ళకు లెజిటిమిస్టులు (legiti-mists) అని పేరు వచ్చింది. (legitimate - చట్టబద్ధమైన, న్యాయమైన) వీళ్ళలో కొందరు కార్మిక వర్గ పక్షాన నిలబడినట్లు నటిస్తూ బూర్జువా దోపిడీని ఖండించారు. పేజి : 46

**44.** భూస్వాముల ప్రయోజనాల రక్షణకు పాటుపడే టోరీ (Conservative) పార్టీలోని కొందరు రాజకీయవాదులు 1840 తర్వాత 'యంగ్ ఇంగ్లండ్' (Young England) అనే బృందంగా ఏర్పడ్డారు. రాజకీయంగా క్రమక్రమంగా బలపడిన

బూర్జువా వర్గానికి వ్యతిరేకంగా చేసే ప్రయత్నాలలో వీళ్ళు (ఫ్రెంచి లెజిటిమిస్టుల మాదిరే) సోషలిజం ప్రచారం చేశారు. ఈ సోషలిజమే ఫ్యూడల్ సోషలిజం. పేజి : 46

**45.** ఇది ప్రధానంగా జర్మనీకి వర్తిస్తుంది. జర్మన్ భూస్వాములూ, ఫ్యూడల్ ప్రభువులూ మేనేజర్లను పెట్టి తమ భూములలో విస్తారమైన భాగాలను సొంత వ్యవసాయం చేసుకుంటారు. అంతేకాక, బీట్‌రూటుతో చక్కెర, బంగాళాదుంపలతో సారాయి తయారుచేసే ఫ్యాక్టరీలు నడుపుతారు. వీళ్ళ కంటే ధనవంతులైన బ్రిటిష్ ప్రభువులు యింకా యీ స్థితికి దిగజారలేదు గానీ, వాళ్ళు కూడా నమ్మదగని జాయింటు స్టాక్ కంపెనీలు తమ పేర్లు వినియోగించుకోడానికి అనుమతించి, తగ్గిపోతున్న తమ ఆదాయాలను తద్వారా భర్తీ చేసుకోవడం నేర్చుకున్నారు. (1888 నాటి ఇంగ్లీషు కూర్పులో ఎంగెల్సు ఇచ్చిన వివరణ). పేజి : 48

**46.** **జర్మన్ తత్వవేత్త కాంట్ (Kant, Immanuel)** (1724-1804) సిద్ధాంతం ప్రకారం మానవులకు పుట్టుకతోనే శుద్ధ వివేకమూ (Pure Reason), ఆచరణాత్మక హేతువు (వ్యవహార వివేకమూ) (Practical Reason) అనేవి వున్నాయి. రెండూ వేర్వేరు కూడా కాదు. శుద్ధ వివేకమే నిత్య జీవితంలో వ్యవహార వివేకంగా పని చేస్తుంది.

మన ఇంద్రియాలు బాహ్య జగత్తును గురించి రంగు, రుచి, వాసన మొదలైన అనుభవాలను మాత్రమే యిస్తాయి. ఆ అనుభవాలను శుద్ధ వివేకం తన సహజ లక్షణాలైన కాలం (Time), స్థలం (Space), కార్యకారణ సంబంధం (Causality) అనే మూసలలో పోసి జ్ఞానంగా మారుస్తుంది. కానీ దేవుడూ, ధర్మమూ, ఆత్మా మొదలైనవి యింద్రియాలకూ, తర్కానికీ అతీతమైనవి; కనుక అవి శుద్ధ వివేకానికి కూడా అతీతమైనవి. వాటిని గురించి మనకు నిశ్చితమైన విశ్వాసాలు కలిగించేది వ్యవహార వివేకం. కాంట్ సిద్ధాంతం ప్రకారం ఇది దేశ కాలాలతోనూ, వ్యక్తుల జీవితానుభవాలతోనూ నిమిత్తం లేకుండా సర్వ మానవులకూ సమంగా వర్తించే దైవికశక్తి లాంటిది. మానవులకు ధర్మాధర్మ విచక్షణ యిచ్చేది వ్యవహార వివేకమే. (కనుక అంతరాత్మ అనవచ్చు) ఇది

మానవుల ఇచ్ఛను పాలిస్తుంది. అంటే బాహ్య శాసనాల ద్వారా కాదు. ఇచ్ఛ యొక్క స్వభావమే వ్యవహార వివేకం. ధర్మాధర్మ విచక్షణ యిచ్చేది గనుక, వ్యక్తి పరిమితం కాదు గనుక, మన సంప్రదాయం ప్రకారం దీన్ని ధర్మదేవత అనవచ్చు. ఫ్రెంచి బూర్జువా విప్లవాన్ని పరిశీలించి కాంట్ దాని తాత్విక భావాలను భౌతిక ప్రయోజనాల నుండి వేరు చేశాడు. ఆ విప్లవంలో బూర్జువా వర్గం తన వర్గ ప్రయోజనాల కోసం పోరాటం చేయడం ధర్మాలు సాధించదలచుకుందని అన్నాడు. పేజి : 49

**47.** **జర్మన తత్వవేత్త షోపెన్‌హౌవర్ (Schopenhauer, Arthur)** (1788- 1860) - సిద్ధాంతం ప్రకారం మానవుని నడిపించేది మనస్సూ కాదు, మేధాకాదు, చైతన్యమూ కాదు - ఇచ్ఛ (will). మన కోర్కెలు హేతుబద్ధంగా వుండవు. కానీ మన కోర్కెలను సమర్థిస్తూ వాదాలూ, తర్కాలూ సృష్టిస్తుంది మన మేధ. కాబట్టి ఇచ్ఛకు బానిసే మానవ మేధ. ఇచ్ఛ మానవులనే కాదు పాలించేది - సకల జీవజాతులను పాలించేది అదే. సకల చరాచర సృష్టిని పాలించేదీ అదే. మానవాతీత శక్తిగా చిత్రించిన ఇచ్ఛను భారత సంప్రదాయం ప్రకారం ఇచ్ఛాదేవత అనవచ్చు.

ఈ సిద్ధాంతం ప్రకారం కూడా విప్లవాలను వర్గ పోరాటం వర్గ ప్రయోజనాల దృక్కోణం నుండి పరిశీలించడానికి బదులు ఇచ్ఛ అనే తాత్విక అభౌతిక భావ దృక్కోణం నుండి షోపెన్‌హౌవర్, కాంట్ పరిశీలించారు. పుట :49

**48.** ఒక విదేశ భాషలోని భావాలు మనం గ్రహించాలంటే వాటిని మన భాషలోకి అనువదించుకుంటాం. జర్మన్ పండితులు చేసుకున్నదీ అనువాదమే. కానీ యిలాంటి అనువాదం కాదు. వాళ్ళు ఫ్రెంచి సోషలిస్టు భావాలను రాజకీయ పరిభాషలో నుండి తమ తాత్విక పరిభాషలోకి అనువదించుకున్నారు. (ధర్మదేవత, ఇచ్ఛాదేవత వగైరా) ఆ అనువాదంతో సోషలిస్టు భావాలు తాత్విక భావాలుగా రూపాన్ని మార్చుకొన్నాయి. పేజి : 49

**49.** **పాలిమ్ సెస్ట్స్ (Palimsests)** అనే పూర్వకాలపు ఫలకాలపై రాతలను గురించి ఇక్కడ ప్రస్తావన. ఆదిమ జాతుల వీరగాథలు ఈ ఫలకాలపై లిఖితమై వున్నాయి. తరువాతి కాలంలో క్రైస్తవ సన్యాసులు ఈ పాఠాలు చెరిపివేసి,

వాటిపైన ఆయా నూతన శకాలకూ నూతన కాలాలకూ సరిపోయిన "నూతన దివ్య పురుషుల" జీవితాలు రాశారు. పేజి : 49

50. **మానవజాతి పరాయీకరణ (Alienation of Humanity)** - మానవులు మానవత్వం కోల్పోవడం; మానవులు మానవుల్లాగా బతక లేకపోవడం.

మానవుని విలక్షణ గుణం శ్రమ. కానీ శ్రమ చేసే కార్మికుడు తన కోసం తాను ఉత్పత్తి చేయడంలేదు. -యజమాని కోసం చేస్తున్నాడు. అంతేగాక, ఫ్యాక్టరీలో శ్రమ చేసే కార్మికుడు మనిషిలాగా కాక, యంత్రంలాగా శ్రమ చేస్తున్నాడు. నిద్రాహార మైధునాల్లాంటి జంతు ధర్మాల్లో మాత్రమే మానవుడు స్వేచ్ఛగా, బుద్ధిపూర్వకంగా, సంతోషంతో వ్యవహరిస్తున్నాడు. శ్రమలో స్వేచ్ఛా, ఇష్టమూ, సంతోషమూ వుండడంలేదు. కనుక మానవుడు మానవత్వానికి దూరమౌతున్నాడు. లేక, తనకు తాను అన్యుడౌతున్నాడు (Self alienation of man) మానవ అన్యధాకరణ భావానికి యిది ఒక వ్యాఖ్య.

బూర్జువా సమాజంలో మానవుని శ్రమా, దాని ఫలితాలు - అనగా శ్రమ నుండి ఉద్భవించిన ఉత్పాదితాలు, సొత్తు వగైరా - మానవునిపైన రాజ్యం చేసేటట్టీ, అతనికి అన్యమైనట్టి శక్తిగా ఏర్పడతాయి.

మార్క్సిస్టు దృక్పథం నుండి అన్యధాకరణ సమస్యను విశ్లేషించినప్పుడు సామాజిక సంబంధాల విశ్లేషణ ప్రధానమైన విషయం. ఈ గ్రంథంలో యీ సందర్భంలో "మానవజాతి అన్యధాకరణ" అనే పదం జర్మన్ "అసలు" సోషలిజానికి ప్రతినిధులలో ఒకడైన హెస్ రచనల నుండి ఉటంకింపు. నిజమైన సామాజిక సంబంధాలను వాళ్ళు విశ్లేషించక పోవడమే "అసలు" సోషలిస్టుల ప్రధానమైన పొరపాటు. తాను అవగాహన చేసుకోలేని విషయాలకు, హేగెల్ నుండీ, ఫొయర్‌బాఖ్ నుండీ తెచ్చుకున్న పారిభాషిక పదాలను అంటగట్టేవాళ్ళు. ఇందుకని మార్క్స "అసలు" సోషలిస్టులను విమర్శించాడు. పేజి : 49

51. **"సాధారణ్యం పదవీ భ్రష్టత పొందింది" (Dethronement of the Category of the General)** అనే పదాన్ని కూడా వాళ్ళు పైన వివరించిన విధంగానే వాడుతూ వుండేవాళ్ళు. తత్వశాస్త్రంలో రెండు వాచకాలున్నాయి : సామాన్యమూ, నిర్దిష్టమూ. వీటికి పరస్పరం చాలా దగ్గర సంబంధం వుంది.

నిర్దిష్టం అనగా, ప్రత్యేక రూపాల్లో బహిర్గతమవుతున్న వాస్తవం. "రాముడు", "వాసు" లు ప్రత్యేకమైన మనుషులు; "మానవుడు" అనేది వాళ్ళిద్దరికీ వర్తించే సామాన్య వాచకము. ఇలాగే బానిస, ఫ్యూడల్, పెట్టుబడిదారీ సమాజాలు నిర్దిష్ట రూపాలు. ఆయా సమాజాల్లో వర్గాల మధ్య బానిస, బానిస యజమాని; ఫ్యూడల్ భూస్వామి, రైతు బానిస; బూర్జువా, కార్మికుడూ - ప్రత్యేక సంబంధాలు వున్నాయి. ఈ సమాజాలన్నిటికీ వర్తించే సామాన్య వాచకం రాజ్యం. జీవితాన్ని విశ్లేషించేటప్పుడు దానిని రెండు వైపుల నుండీ చూడాలి; ఎందుచేతనంటే నిర్దిష్టంలోనే సామాన్యం బహిర్గతమవుతుంది. "అసలు" సోషలిస్టులు రాజ్యాల్ని విశ్లేషించినప్పుడు, వర్గాల మధ్య వుండే ప్రత్యేక ఆర్థిక సంబంధాల దృక్పథం నుండి విశ్లేషించలేదు. అందుచేతనే వాళ్ళకు "రాజ్యం" అనేది కేవలం సామాన్య వాచకం (the Category of the General) - హెగెలీయన్ తత్వశాస్త్రం నుండి తెచ్చుకున్న పదం) అయిపోయింది. ఈ "సామాన్య వాచకాన్ని (అనగా స్టేట్) రద్దు చేయడం" జరగాలని వాళ్ళు డిమాండు చేశారు. "అసలు" సోషలిస్టులు చేసిన ఈ వ్యాఖ్యానం కారణంగా మార్క్సు వాళ్ళను విమర్శించాడు. పేజి : 49

**52.** సోషలిజం అనేది బూర్జువా వర్గం మీద కార్మికవర్గం పోరాటం చేసే దశలో పుడుతుంది. కానీ జర్మనీలో బూర్జువా వర్గమే యింకా ఫ్యూడల్ వర్గం మీద పోరాటమే ప్రారంభించని దశలో పుట్టింది జర్మన్ సోషలిజం. జర్మన్ సోషలిస్టులకు ఆర్థిక రాజకీయ శాస్త్రాలలో ఓనమాలు కూడా తెలియవు. వాళ్ళు కేవలం తత్వశాస్త్రాలు చదువుకొని తమ పిచ్చి వేదాంతానికే "జర్మన్ సోషలిజం" అని పేరు పెట్టుకున్నారు. అంతేగాక వాళ్ళకు మాటలు తప్ప రాజకీయ కార్యకలాపాలేమీ లేవు. ఆ మాటలు కూడా ఎవరికీ అర్థం కావు. అందువల్ల వాళ్ళ అజ్ఞానం ఛాందస అమాయకత్వంగా వర్ణితమైంది. కానీ, ఆ తర్వాత, జర్మన్ బూర్జువా వర్గం ఫ్యూడల్ వ్యతిరేక పోరాటం ప్రారంభించినపుడు ఈ జర్మన్ సోషలిస్టులు బూర్జువాలను వ్యతిరేకించారు. దేశంలో రాజకీయాలే లేనప్పుడు అమాయకంగా వున్నవాళ్ళు, రాజకీయాలలో ప్రవేశించి ఫ్యూడల్ వర్గానికి అనుకూలంగా పని చేసినప్పుడు, వాళ్ళను యింకా అమాయకులనీ, ఛాందసులనీ అనలేము గదా. పేజి : 50

**53.** **ఉదారవాద ఉద్యమం (liberal movement)** – ఫ్యూడల్ యుగంలో ప్రభుత్వం నిరంకుశంగా వుంటుంది. అలా నిరంకుశంగా వుండకుండా ప్రజలకు ఓటు హక్కూ, వాక్స్వాతంత్ర్యమూ, మొదలైన హక్కులు కొన్ని కావాలనీ, పరిపాలన ఉదారంగా వుండాలనీ కోరేది ఉదారవాదం. ఫ్యూడలిజం మీద బూర్జువా వర్గం చేసే రాజకీయ పోరాటపు తొలిదశలో ఉదారవాదం పుడుతుంది. పేజి : 50

**54.** **అల్పబుద్ధులు (philistines)** – చిల్లర వాంఛలు తప్ప కళలూ, రాజకీయాలూ, మొదలైన వాటికి సంబంధించిన ఏ అభిరుచులూ లేనివాళ్ళు. డబ్బు సంపాయించడం తప్ప, మానసిక జీవితం (mental life) అనేది బొత్తిగా లేనివాళ్ళు. ఇక్కడ జర్మన్ పెటీ బూర్జువా వర్గానికి వర్తిస్తుంది యీ పదం. పేజి : 51

**55.** జర్మన్ తాత్వికుల భావజాలం సాలెగూళ్ళ వంటిది. వట్టి పనికిమాలిన బూజు, జర్మన్ తాత్వికులు తమ తాత్విక సిద్ధాంతాలను స్పష్టమైన భాషలో వివరించకుండా, అలంకార భూయిష్టమైన కావ్యభాషలో వర్ణించారు. అంతేగాక, వెక్కసపు మమతలు (sickly sentiments) జోడించారు. పేజి : 52

**56.** 1848 నాటి విప్లవ తుఫాను ఈ అసహ్యమైన ధోరణినంతటినీ ఊడ్చిపారవేసి, దీని ప్రచారకులకు సోషలిజంలో తలదూర్చాలని మళ్ళీ కోరిక పుట్టకుండా చేసింది. హెడ్ కార్ల్ గ్రూన్ ఈ ధోరణికి ప్రధాన ప్రతినిధి, లాక్షణిక ఉదాహరణ. (1890 నాటి జర్మన్ కూర్పుకు ఎంగెల్సు వివరణ). పేజి : 52

**57.** **ప్రౌధన్ (Proudhon, Pierre-Joseph)** (1809–1865) ఫ్రెంచి పెటీ బూర్జువా సోషలిస్టు, అరాచకవాద సిద్ధాంతం సృష్టించాడు. 'ఆస్తి అంటే ఏమిటి ?', 'దారిద్ర్యం యొక్క తత్వశాస్త్రం', మొదలైన గ్రంథాలు రచించాడు. 'తత్వశాస్త్ర దారిద్ర్యం' అనే గ్రంథంలో మార్క్సు అతని సిద్ధాంతాభిప్రాయాలను ఖండించాడు. పేజి : 52

**58.** విదేశాల నుండి దిగుమతి అయే సరుకులు చౌకగా [illegible]తో స్వదేశీ ఉత్పత్తిదారులు పోటీ చెయ్యలేరు. వాటి మీద సుంకాలు విధిస్తే వాటి ధర

పెరుగుతుంది. అప్పుడు స్వదేశీ సరుకులు వాటితో పోటీ చేయగలవు. స్వదేశీ సరుకులు రక్షణార్థం విదేశీ సరుకుల మీద వేసే యీ సుంకాలే రక్షణ సుంకాలు (Protective duties). ఇవి స్పష్టంగా పెట్టుబడిదార్ల సౌకర్యం కొరకే. పేజి : 54

**59. బాబెఫ్ (Babeuf, Francois - Noel)** (1760-1797) - బీద కుటుంబంలో పుట్టిన ఫ్రెంచి విప్లవకారుడు. భూమి అంతా సమాజపరం కావాలనీ, దేశంలో ఉత్పత్తి అయ్యే సరుకులన్నీ ప్రభుత్వం స్వాధీనం చేసుకొని అందరికీ సమానంగా పంచాలనీ యితని సిద్ధాంతం. 1794 జులైలో విప్లవ జాకొబిన్ ప్రభుత్వాన్ని కూలదోసి బూర్జువా వర్గం అధికారంలోకి రావడం గమనించిన బాబెఫ్ బీదల నియంతృత్వం వుంటే తప్ప ధనికుల ఎదురు దాడిని ఆపలేమని సూత్రీకరించాడు. బూర్జువా ప్రభుత్వాన్ని కూలదోయడానికి 1796 లో కుట్రకు ఏర్పాట్లు చేయడంలో పోలీసులకు చిక్కి 1797 లో ఉరికంబమెక్కాడు. కార్మికవర్గం యింకా బీజ రూపంలోనే వుంది. కనుక, అతనికి కార్మికవర్గ చారిత్రక పాత్ర అర్థం కాలేదు. ఊహాజనిత కమ్యూనిస్టు. పేజి : 54

**60. సెయింట్ సైమన్ (Saint - Simon, Henri)** (1760-1825) - ఫ్రెంచి ఊహాజనిత సోషలిస్టు. ధనిక కుటుంబంలో పుట్టి, 23వ యేట మంచి భవిష్యత్తు గల ఉన్నత మిలిటరీ ఉద్యోగానికి రాజీనామా యిచ్చి, మానవ విజ్ఞానమంతా ఏకసిద్ధాంతబద్ధం చేయడానికి కృషి చేశాడు. విజ్ఞాన శాస్త్రాలను సమగ్రంగా గ్రహించడానికి 40వ ఏట ఒక సాంకేతిక విద్యాలయంలో విద్యార్థిగా చేరాడు. మానవ సమాజ పునర్నిర్మాణ కృషిలో తన సంపదనంతా వ్యయం చేశాడు. భార్య విడనాడినా, కటిక దరిద్రం చుట్టుకున్నా తన కృషి మారలేదు.

అతని సిద్ధాంతం ప్రకారం భావి సోషలిస్టు సమాజపు మౌలిక అంశాలు ఇవి : విధాయక శ్రమా, శాస్త్రవిజ్ఞాన పరిశ్రమల ఏకత్వమూ, ఆర్థిక వ్యవస్థలో కేంద్రీకరణమూ, క్రమబద్ధతా; సొంత ఆస్తి రద్దు చేయకూడదు; శాస్త్రజ్ఞులూ, పెట్టుబడిదార్లూ సమాజానికి నాయకత్వం వహించాలి. తన సోషలిస్టు లక్ష్యం విప్లవం ద్వారా కాక, భావాల ప్రచారం ద్వారా సాధ్యమౌతుందని అనుకున్నాడు.

కార్మికులు బాధపడుతున్నారని గమనించాడు. కానీ కార్మికవర్గం సమాజాన్ని మార్చే చారిత్రక పాత్ర అతనికి అర్థం కాలేదు. పేజి : 54

**61.** **ఫోరియర్ (Fourier, Charles)** (1772-1837) – ఫ్రెంచి ఊహాజనిత సోషలిస్టు; వ్యాపారస్తుడు. వర్తకుల దురాచారాలను నగ్నంగా వెల్లడించాడు. పెట్టుబడిదారీ సమాజంలో భిన్న వ్యక్తుల ప్రయోజనాలు పరస్పర విరుద్ధంగా వుంటాయని చెప్పాడు. సమాజాన్ని సంస్కరించడానికి అతనొక పథకం తయారు చేశాడు. ఆ సమాజంలో మానవుని సామర్థ్యాలన్నీ వికసిస్తాయి. భావి కమ్యూనిస్టు సమాజం గురించి ప్రతిభావంతమైన జోస్యాలు చెప్పాడు. ఉత్పత్తి శక్తుల అపార అభివృద్ధి గురించీ, పని చేయడం మనిషి యొక్క ప్రధాన అవసరం అనీ, శరీర శ్రమకు, మానసిక శ్రమకు మధ్యా, పట్టణాలకు గ్రామాలకు మధ్యా భేదం తొలగించడం వగైరాల గురించీ, కానీ, తన పథకం సాధించడానికి విప్లవం అవసరం లేదనీ మనుషులను మార్చాలనీ అనుకున్నాడు. ఆ పథకం అమలు పరచడానికి డబ్బు కొరకు అతను నెపోలియన్‌కూ, అనేక ధనవంతులకూ జాబులు రాశాడు. పేజి : 54

**62.** **ఓవెన్ (Owen, Robert)** (1771-1858) – ఇంగ్లీషు ఊహాజనిత సోషలిస్టు. చిన్న పెట్టుబడిదారుగా వుండి కార్మికుల దైన్యస్థితిని బాగా గమనించాడు. 1817 లో అతను సమాజ పునర్నిర్మాణానికి ఒక పథకం తయారుచేశాడు. భౌతిక పరిస్థితులవల్లా, విద్యవల్లా, శిక్షణవల్లా (అనగా, కేవలం భౌతిక కారణాలవల్లనే) మానవుని గుణాలు ఏర్పడుతాయని అతని విశ్వాసం. ఆ విశ్వాసంతో అతను అమెరికాలో కొంత భూమి కొని, అక్కడ కమ్యూనిస్టు సూత్రాల మీద ఒక కొత్త సమాజం స్థాపించాడు. వర్గ పోరాటాన్ని నిరాకరించి, శాంతియుతంగా పెట్టుబడిదారీ సమాజాన్ని మార్చవచ్చునని ఊహించాడు. పేజి : 54

**63.** ఈ బ్రాకెట్లు మూలం లోనివే. పేజి : 54

**64.** **"ఫలాన్‌స్టీర్లు" (Phalansteres)** – ఫోరియర్ పథకంలోని సోషలిస్టు సమాజాల పేరు. దీనికి ఏకవచనం ఫలాంక్స్ (Phalanx).

**"హోమ్ కాలనీలు" (Home colonies)** – ఓవెన్ అమెరికాలో స్థాపించిన కమ్యూనిస్టు సమాజాల పేరు.

"ఇకేరియా" (Icaria) - కాబెట్ (Cabet, Etienne) (1788-1856)- ఊహాస్వర్గ పథకంలోని కమ్యూనిస్టు సమాజం పేరు. తరువాత అతను అమెరికాలో స్థాపించిన కమ్యూనిస్టు సమాజానికి కూడా అదే పేరు పెట్టాడు. పేజి : 58

**65.** ప్రజలందరికీ ఓట్లు కావాలని ఇంగ్లండులో 1835 నుండి 1848 వరకు చార్టిస్టు ఉద్యమం జరిగింది. ఆ ఉద్యమకారులే చార్టిస్టులు (Chartists). పేజి: 58

**66.** 1843, 1850ల మధ్య పారిస్‌లో La Reforme అనే పెటీ బూర్జువా ప్రజాతంత్ర రిపబ్లికన్ పత్రిక వుండేది. సాంఘిక, రాజకీయ సంస్కరణల కొరకు అది కృషి చేసింది. దాని అనుచరులు రిఫార్మిస్టులు (reformists). పేజి : 58

**67.** **సోషల్ డెమోక్రట్లు (Social-democrats)** - పార్లమెంటులో లెద్రూ-రోలిన్ ద్వారానూ, సాహిత్యంలో లూయీ బ్లాంక్ ద్వారానూ, దినపత్రికా ప్రపంచంలో La Reforme పత్రిక ద్వారానూ ప్రతిబింబించిన పార్టీ. డెమోక్రటిక్ లేక రిపబ్లికన్ పార్టీలో కొద్దో గొప్పో సోషలిస్టు భావాలు గల వాళ్ళకు సోషల్ డెమోక్రసీ అనే పేరు వర్తిస్తుందని ఆ పేరు పెట్టిన వాళ్ళ విశ్వాసం. (1888 నాటి ఇంగ్లీషు కూర్పుకు ఎంగెల్సు వివరణ).

ఫ్రాన్స్‌లో సోషల్ డెమోక్రటిక్ పార్టీ అని పేరు పెట్టుకున్న పార్టీకి రాజకీయ రంగంలో లెద్రూ - రోలిన్, సాహిత్యంలో లూయీ బ్లాంక్ ప్రతినిధులు. కనుక దీనికీ, నేటి జర్మన్ సోషల్ డెమోక్రసీకీ అనంతమైన భేదం వుంది. (1890 నాటి జర్మన్ కూర్పుకు ఎంగెల్సు వివరణ). పేజి : 59

**68.** జర్మనీ, ఆస్ట్రియా, రష్యాలకు పోలండు లోబడి వుండేది. పోలిష్ జాతీయ స్వాతంత్ర్య పోరాటం విజయవంతం కావాలంటే, ఆ పోరాటంతో పాటు ఫ్యూడల్ వ్యవస్థ మీద బూర్జువా ప్రజాతంత్ర విప్లవం కూడా ఏకకాలంలో జరగాలని పోలిష్ డెమోక్రటిక్ పార్టీ విశ్వసించింది. ఇక్కడ వ్యవసాయ విప్లవమంటే ఫ్యూడల్ వ్యవస్థ మీద విప్లవమే. పోలిష్ డెమోక్రటిక్ పార్టీ 1846 జనవరి 24న క్రాకోవ్ నగరంలో తిరుగుబాటు లేవదీసి, దున్నేవానికి భూమి అని ప్రకటించింది. ఆ తిరుగుబాటు ఓడిపోయింది. పేజి : 59

# అంతర్జాతీయ గీతం

- యూంజనీ పాటిర్

అను : బాలాంత్రపు నళినీకాంతరావు

ఆకలి మంటల మలమలలాడే
అనాథులందరు లేవండోయ్
హింసారతిని సహించగలేక
ఈసడించినది ఎల్లధర్మమూ

మంచి దినాలు రానున్నాయి
మనకందరకు లేవండోయ్
ప్రధానమగు నీ పోరాటంలో
పాల్గొననందరు రారండోయి

సాంప్రదాయములె కొంపెలు దీసె
ఈ సంకెళ్ళను తెంచివేయగా
దాసత్వంబును తరిమివేయగా
దాసులందరును లేవండోయ్

నేలకు పనులకు నిధులకు గనులకు
నేతలైన వారందరు గనుడీ
వారి సౌఖ్యమూ వారల దర్జా!
వారి భోగమూ వారల దర్పం!

మన రెక్కల కష్టంబే కాదా?
ఈ గతి మన కష్టార్జితమంతా
ఎవరో కొందరి భోగ తృప్తికై
ఇనుప పెట్టియల మూల్గుచున్నది

ఇప్పుడు దానిని తిరిగి ఇమ్మనీ
అందరమొకటై తొందరజేయుట
న్యాయముగా మనకొచ్చేదెంతో
అది రాబట్టుటకే సుమ్మండీ!

కార్మిక కర్షక సంయోగంచే
కష్ట జీవులందరి ఐక్యతయే
పాటుపడే మన అందరి పక్షం
మనదే దేశము ప్రజలము మనమే!

పనికి దొంగలౌ వారలకిచ్చుట
పని లేదండీ ప్రవేశించగా
ఇంతకాలమూ అనామకులుగా
ఏ మూలనో మన్నణచి యుంచిరి

అబ్బబ్బా మన రక్త మాంసములు
హరించి ఎందరు తెగబలిశారో!
ప్రజల అశాంతికి కారణమగు ఈ
రక్త పిపాసులు పీడ వదిలితే
దిక్కు దిక్కులా శాంతి తేజమే
దేశదేశముల ఆనందమ్మే
అంతర్జాతీయ సంస్థయే
అశేష మానవ కులమై పోవున్
ప్రధానమగు ఈ పోరాటంలో
పాల్గొననందరు రారండోయ్




రష్యా విప్లవం



చైనా విప్లవం



వియత్నాం విప్లవం



క్యూబా విప్లవం



యుగయుగాల మానవాళి నలరించు కళాదేవి
సౌందర్యం సమస్తం నా అరచేతికి చిక్కుగాక
దిఙ్మండల సహితంగా ఈ జగత్తు యావత్తు
నా బుద్ధికీ సులభంగా అవగాహన మౌనుగాక.

నిరుత్సాహ నిరుద్వేగ మిధ్యా జీవిత మెందుకు
గుదికాళుల గాడిదలా, చల్లారిన బూడిదలా
అచ్చమైన మనుషుల్లా నిండు బతుకు బతుకుదాం
కోపంతో, తాపంతో, రాగంతో, ద్వేషంతో

శాంతి పూర్ణమైన బతుకు నాకు వద్దు నాకు వద్దు
ఘూర్ణితార్ణవమ్ములాంటి నా మనసుకు పడదు శాంతి
పోరాటం పోరాటం పోరాటమె నా కిష్టం
మహోత్తాల లక్ష్యాంకితమైనట్టిది.

లక్ష్యరహిత గమ్యరహితమైన బతుకువద్దు మనకు
నిస్సారపు నిర్జీవపు కాకి బతుకు వద్దు మనకు
పదపద పద పోదాం పద దూరంగా వేగంగా
కష్టాలను క్లేశాలను లెక్కించక పోదాం పద.



విద్యార్థి దశలో కార్ల్ మార్క్స్ కవిత - 1836

వెల రూ 10/-

82

# Check List

| Book Number | DvK01E140 | Date | 05/04/22 |
| --- | --- | --- | --- |
| Front Cover | Yes | Back Cover | Yes |
| Blank Pages | NO | | |
| Missing Pages | NO | | |
| Prepared By | Mouni | Cutting By | Mouni |
| Scanned By | Swathi | Pages | 85 |